# THE LAST LAUGH




LONDON:
PUBLISHED FOR THE PROPRIETORS, BY R. BRYANT,
AT PUNCH'S OFFICE, WELLINGTON STREET, STRAND.
AND SOLD BY ALL BOOKSELLERS.

The beginning and...

గాఢ౧

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 3 | మే 1992 | సంచిక 34

# విషయసూచిక



విడిప్రతి 3/- వార్షిక చందా రూ.40/-

ముఖచిత్రం

తంజావూరు పెయింటింగ్

Printed, Published and Edited by Shri ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**
B-15, Journalist Colony, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Caaba,** *n.* A large stone presented by the archangel Gabriel to the patriarch Abraham, and preserved at Mecca. The patriarch had perhaps asked the archangel for bread.

**Cabbage,** *n.* A familiar kitchen-garden vegetable about as large and wise as a man's head.

The cabbage is so called from Cabagius, a prince who on ascending the throne issued a decree appointing a High Council of Empire consisting of the members of his predecessor's Ministry and the cabbages in the royal garden. When any of his Majesty's measures of state policy miscarried conspicuously it was gravely announced that several members of the High Council had been beheaded, and his murmuring subjects were appeased.

**Calamity,** *n* A more than commonly plain and unmistakable reminder that the affairs of this life are not of our own ordering. Calamities are of two kinds: misfortune to ourselves, and good fortune to others.

**Callous,** *adj.* Gifted with great fortitude to bear the evils afflicting another.

When Zeno was told that one of his enemies was no more he was observed to be deeply moved. "What!" said one of his disciples, "you weep at the death of an enemy?" "Ah, 'tis true," replied the great Stoic; "but you should see me smile at the death of a friend."

**Calumnus,** *n.* A graduate of the School for Scandal.

**Camel,** *n.* A quadruped (the *Splaypes humpidorsus*) of great value to the show business. There are two kinds of camels – the camel proper and the camel improper. It is the latter that is always exhibited.

**Cannibal,** *n.* A gastronome of the old school who preserves the simple tastes and adheres to the natural diet of the pre-pork period.

**Cannon,** *n.* An instrument employed in the rectification of national boundaries.

**Canonicals,** *n.* The motley worn by Jesters of the Co
Heaven.

**Capital,** *n.* The seat of misgovernment. That which pr
the fire, the pot, the dinner, the table and the knife an
for the anarchist; the part of the repast that himself su
is the disgrace before meat. *Capital Punishment,* a p
regarding the justice and expediency of which many w
persons – including all the assassins – entertain grave misgi

**Carmelite,** *n.* A mendicant friar of the order of Mount Ca

As Death was a-riding out one day,
Across Mount Carmel he took his way,
  Where he met a mendicant monk,
  Some three or four quarters drunk,
With a holy leer and a pious grin,
Ragged and fat and as saucy as sin,
  Who held out his hands and cried:
"Give, give in Charity's name, I pray.
Give in the name of the Church. O give,
Give that her holy sons may live!"
  And Death replied,
  Smiling long and wide:
  *"I'll give, holy father, I'll give thee-a ride."*

(ఊహాజనిత ఇంటర్వ్యూ)

# తాపీ ధర్మారావుతో మధురవాణి

– పురాణం సుబ్రహ్మణ్య శర్మ

(తాతాజీ అని అంతా అప్యాయంగా పిలిచే తాపీ ధర్మారావుగారు విజయవిలాసం చదువుతూ వ్యాఖ్యానిస్తూ వుంటారు. కళాప్రపూర్ణ త్రిపురాన సూర్యప్రసాదరాయ కవి, మహామహోపాధ్యాయ ఆచంట సాంఖ్యాయన శర్మ, ఆంధ్ర వాల్మీకి వడ్డాది సుబ్బారాయ కవి, ప్రథమాంధ్రాస్థానకవి శతావధాన శిరోమణి బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులవారు చుట్టూ కూర్చుని ఆలకిస్తూ వుండగా వేదము వెంకటరాయశాస్త్రి గారు ప్రవేశిస్తారు.)

త్రిపురాన సూర్య ప్రసాదరాయ కవి

విజయవిలాస కావ్యమున వేంకట సత్కవి చూపినట్టి య
క్కజమగు నందియందని యొకానొక చందపు పల్కుటందముల్
నిజముగ విప్పి చెప్పితివి నేర్పుదలిర్పగ నీదు వ్యాఖ్య ది
గ్విజయము గాంచుగావుత వివేక నిధానమ ధర్మరాట్కవీ!

ఆచంట సాంఖ్యాయన శర్మ

చతురమగు వేంకటరాయశాస్త్రి బుద్ధి
కందనట్టి యందములు నీదు వ్యాఖ్యఁ జూసి
చూపినాడవు మాకు నీ సూక్ష్మబుద్ధి
ఔర! ఆంధ్ర విశారదుండగుదు నీవు.

ఆంధ్ర వాల్మీకి వడ్డాది సుబ్బారాయకవి

చరితయు అర్థ పుష్టియు రసస్ఫురణంబు గభీరభావ బం
ధురతయు మాకరంద రసతుందిల సత్పద గౌరవంబులున్
వెరపున జూపినాడవు వివేకులు మేలన ధర్మరాయ నీ
సురుచిర నామ మాంధ్రమున సుస్థితి గాంచును వాఙ్మయమ్మునన్.

ఆస్థానకవి బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులు :

కవికిన్ గల్గునొ కల్గదో యనెడు శంకన్ గల్గగా జేయు న
ర్థ విశేషంబులు చేమకూర కవి పద్యాలందు జూపించినా
వవురా! మెచ్చితి మామకాగమన వార్తాఖ్యా స్థలంబందు నీ
వివృతిం; బొంగితి నీదు చాతురికి తాపీవంశ ముక్తామణీ.

**తాపి ధర్మారావు :** క్షమించాలి! ఆనాడు నాకు కలిగిన అభిప్రాయం మనవి చేస్తాను. వేదం వారు అనేక పద్యాలలో సరైన వ్యాఖ్యానం యివ్వలేదనీ, ఎన్నో అందాలను ప్రకటించలేదనీ కావ్య గుణాలనూ, నియమాలనూ పూర్తిగా వారు గుర్తించ జాలక పోయారనీ అనుకున్నా. (పెద్దలు అంతర్ధానం) అదే నా విచారం!

**మధురవాణి :** ఏ యెడ మేలె చూతురు గణింపరు జ్ఞానులు జారుపాటులన్ (నవ్వు)

**తాపీ ధర్మారావు :** అవుననుకో - నా పాండిత్య ప్రకర్ష కోసం గాని, ఇతర వ్యాఖ్యానాల్లో తప్పులు దిద్దడానికి గాని నేను ఈ వ్యాఖ్యానానికి పూనుకోలేదు.

**మధురవాణి :** ఆపండి. స్వోత్కర్ష - మీరు పండిత మర్యాద కోసం అలా అంటున్నారు కాని చేసింది వేదం వేంకట రాయశాస్త్రిగారి వ్యాఖ్యానంలో తప్పు లెన్నడమేగా!

**తాపీ ధర్మారావు :** తప్పదు మరి. మనం పెద్దవాళ్ళ భుజాల మీద నిలబడి ప్రపంచాన్ని చూస్తాం నిజమే. కాని వారి తప్పుల్ని సవరించు కోవలసివస్తే అందుకు అభిమానపడి ఏం లాభం? ఓ నమస్కారం పారేసి దిద్దుకోవాలి.

**మధురవాణి :** మీరు అభ్యుదయ కవులు - మార్క్సిస్టులు అవునో, కాదో తెలీదు గాని అభ్యుదయ రచయితల సంఘం మూలస్తంభాలలోని వారు; పైగా కమ్యూనిస్టులు. మీరు ప్రబంధ సాహిత్యానికి కొమ్ము కాయడం ఏ విధంగా సమర్థనీయం?

**తాపీ ధర్మారావు :** నేను అభ్యుదయ సాహిత్యాన్ని ఉద్యమాన్ని సమర్థిస్తాను. కనుక ప్రబంధ సాహిత్యం మీద విమర్శకు వ్యాఖ్యానించడానికి తగనా?

**మధురవాణి :** అవి బూతుల బుంగలు, ప్రజాసాహిత్యం కాదని మీ వాళ్ళు గొంతు చించుకుని అరుస్తారు గదా! ప్రజాసాహిత్యం కానిదాన్ని మీరెలా నెత్తికెత్తుకున్నారు?

**తాపీ ధర్మారావు :** చేమకూర వెంకటకవి నా అభిమానకవి. పైగా శాస్త్రిగారి వ్యాఖ్యానం మీద ఏర్పరచుకున్న అభిప్రాయం కొంత చెదిరింది. ఈ రసవత్తర కావ్యానికి సరియైన వ్యాఖ్యానం యింకా రాలేదని కొంత విచారించా.

**మధురవాణి :** నిజమే! నా అభిప్రాయం ప్రబంధ సాహిత్యాన్ని పార్టీ దృక్పథం నుంచి ఖండించిన మీరే ఒక్క విజయ విలాసాన్ని హృదయోల్లాస వ్యాఖ్య రచించి పైకెత్తి చూపారేమి?

**తాపీ ధర్మారావు :** అది నాకు ఒక సర్దా. వ్యాఖ్యానం వ్రాయడ మనగానే గుండె బ్రద్దలయింది. నేనొక కాలేజీలో లెక్కలు చెప్పే మాష్టర్ని. నాకున్న సర్దా అంతే ఆంధ్ర సాహిత్యంలో. నా సాహిత్య పరిశ్రమ వ్యాఖ్యాన రచనకు చాలదు. ఆ సంగతి నాకే బాగా తెలుసు.

**మధురవాణి :** అంటే సంప్రదాయ పండితుల కంటె మీరు గొప్ప అని మీకు తెలుసు. మీ ఆధిక్యాన్ని నిరూపించడం కోసమా? చేమకూర కవి పద్యాల రుచి

ఎత్తి చూపడమా? ఏది మీ లక్ష్యం? పైకి ఒకటి లోపల మరొకటి కాదు గదా?

తాపీ ధర్మారావు : నా అభిమాన కవి కావ్యానికి వ్యాఖ్య రచించడానికీ, అభ్యుదయ కవితోద్యమానికీ వారి ఆదర్శానికీ ఏమీ సంబంధం లేదు. ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా అని వాపోయిన కవికి వ్యాఖ్య చేసి న్యాయం చేకూర్చాలనుకున్నాను. చేశాను.

మధురవాణి : అంచాత మీ అభ్యుదయ కవులు పూర్వకవుల్నీ కావ్యాల్నీ ప్రబంధాల్నీ తిట్టడం తగ్గించుకుని మీలాగే బుద్ధిగా అదీ యిదీ కూడా చదువుకుని ఆనందించాలని చెప్పండి. మీరు వాళ్ళ నోరుని మూయిస్తే సంతోషిస్తా.

తాపీ ధర్మారావు : కొంత పాత కవిత్వం ధ్వంసమవుతుంది అన్యాయంగా. కొత్త మార్గం వేసినపుడు చెట్టూ పుట్టా అడివీ ఆకూ అలమూ అంతా కొట్టుకు పోతుంది గదా, యిదీ అలాటిదే.

మధురవాణి : మరి విజయవిలాస హృదయోల్లాస వ్యాఖ్య మీ వేగుచుక్క గ్రంథమాలలోనే వేస్తే సరిపోయేది కదా?

తాపీ ధర్మారావు : మద్రాసులో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారూ, బందరులో ఆంధ్ర భాషాభివర్ధనీ గ్రంథమాల వారు మంచి మంచి గ్రంథాలు ప్రచురిస్తూ వుండే వారు. అప్పుడు మేము కూడా వేగుచుక్క గ్రంథమాలను స్థాపించి, వారు చరిత్రలూ, విజ్ఞాన శాస్త్రాలూ ప్రచురిస్తూంటే మేము వారు విడిచిపెట్టిన సాహిత్య శాఖలనే - డిటెక్టివ్, చారిత్రక నాటకాలూ, స్వీయానుభవాలుగా రాసిన నవలలూ ప్రధానంగా ప్రచురించాము. పౌరాణికమని నేను రాసిన విలాసార్జున నాటకాన్ని అప్పట్లో ప్రకటించలేదు. అప్పుడు యీ విజయ విలాస వ్యాఖ్య అందులో యిమడలేదు. ప్రచురించలేదు.

మధురవాణి : చేమకూర వేంకటకవిగారు కూడా నాయుడని మీరు పరవశించారేమోనని నేను పొరబడ్డాను. క్షమించాలి. (నవ్వు)

తాపీ ధర్మారావు : అందుకే ఆ రోజుల్లో అగ్రవర్ణపు కవులు యితర కులాల నుంచి వచ్చిన కవుల్ని చిన్నచూపు చూసే వారనే బాధపడి చేమకూర వేంకటకవి 'ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా' అని వాపోయాడు. అంత ప్రతిభావంతుడైన కవికి వ్యాఖ్యానం చేయడం గౌరవంగా విధిగా నేను భావించాను. కులాల ప్రసక్తి అంటే - విశ్వనాథ వారు చమత్కారానికే అనుకోండి - కవికోకిల పంచమ స్వరంలో ఆలాపిస్తోంది అని అనలేదా? ఆ రోజుల్లో అదీ వాతావరణం.

మధురవాణి : శతాబ్దాలు మారినా మనస్తత్వం మారలేదు. మీరు విశాఖపట్నంలో స్థాపించిన కవితా సమితి గురించి శ్రీశ్రీ గారి జోకు చెప్పమంటారా?

తాపీ ధర్మారావు : చెప్పు. నీకడ్డేవిటి?

మధురవాణి : సున్నం వీర్రాజుగారు, తాపీ ధర్మారావుగారు, రాళ్ళబండి కుటుంబరావు గారు ఇలా చాలమంది వున్నారు. మరి సున్నం వుండీ, తాపీ వుండి, రాళ్ళబండి వుండి కవితా సమితికో సొంత భవనం లేకపోయిందే అని.

తాపీ ధర్మారావు : మా యింటిపేరు పూర్వం తాపీ వారు కాదు. అది పౌరుష నామం.

మధురవాణి : తాపీ అంటే స్లో అని కూడా. మీ విజయ విలాస వ్యాఖ్య ఒకటి చదివి చూపిస్తారా? ఎలా వుందో విని ఆనందిస్తా.

తాపీ ధర్మారావు : చిత్తజు డర్గి తూపు మొనచేసినఁ జేయగనిమ్ము - పై ధ్వజం
బెత్తిన యెత్తనిమ్ము వచియించెద గర్గిన మాట గట్టిగా;
నత్తరళాయతేక్షణ కటాక్ష విలాస రస ప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండు మీలకున్.

ఈ పద్యంలో చేమకూర వేంకటకవి సుభద్ర కన్నులు పద్మాల కంటె గండు మీల కంటె అందంగా వుంటాయని చెప్పాడు. జల ప్రవాహం పద్మానికి మెడదాకా, చేపలకు తలమునిగేలా వుండటం సహజం. ఆమె పద్మదళాయతాక్షి మీనాక్షి కూడా. పద్మం మన్మథుని బాణం. చేప ధ్వజం. తన ఆయుధాలను కించపరచింది సుభద్ర అన్న కోపంతో మన్మథుడు తన ఆయుధాలను పైకెత్తినా అవి క్రమంగా సుభద్ర కటాక్ష విలాస రసప్రవాహాలు కుత్తుక బంటిగానూ తలమున్కలు గానూ వుంటాయని అంటాడు అర్జునుడు. ఈ పద్యంలో శృంగార రసపు జాలు - ప్రవాహమే ఈ పద్యమునందలి కటాక్ష విలాస రస ప్రవాహం.

మధురవాణి : పైకి అభ్యుదయ కవులయినా శృంగార ప్రబంధాలు చదువుకుంటే మీ వంటి వారి వద్ద చదువుకోవాలి. అవును మీ గురువుగారు గిడుగు రామమూర్తి పంతులుగారు మీ వైపు వీపు త్రిప్పి ముఖం చూడకుండా పాఠం చెప్పే వారటగా - ?.

తాపీ ధర్మారావు : వ్యావహారిక భాషావాదాన్ని వ్యతిరేకించే వాడ్నని నా మీద కోపం - నేను ముందు గ్రాంథిక భాషావాదిని. అంతేగాని కులం కాదు.

మధురవాణి : (నవ్వి) మీకుండే తిక్కలలో అదొటి కాబోలు. అయినా మీకు పేరు వచ్చింది అందుకూ యిందుకూ కాదు - 'దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు' రాసినందుకు గదా!

తాపీ ధర్మారావు : కవికి తన యిష్ట రచన ఓటి వేరుగా వుంటే దానికి గాక మరోదానికి పేరు వస్తే కించిత్తు చింతగానే వుంటుంది. ఏం చేస్తాం?

మధురవాణి : అవన్నీ బయట పెట్టి మీరు మన దేవాలయ సంస్కృతి మీద గౌరవం తగ్గించినట్టా, పెంచినట్టా?

తాపీ ధర్మారావు : లక్ష్యం సత్య నిరూపణమే కాని ఎవరేమనుకొంటారని కాదు.

మధురవాణి : అలా చెప్తారు గాని మీ కమ్యూనిస్టులకు మన మతం మన సంస్కృతి అంటే చిన్నచూపు. రష్యాలో వాన కురిస్తే యిక్కడ గొడుగు పడతార న్నది నిజమేనా?

మిసిమి, మే 1992

**తాపీ ధర్మా రావు:** ఏదైనా శృతి మించితే అగ్జజంగానే వుంటుంది. అభ్యుదయ కవిత్వయుగం రాకపోతే మనవాళ్ళు యింకా ప్రేయసీ, ప్రేయసీ అంటూ కలవరిస్తూ వుండే వాళ్ళు 'వేయి కన్నులతోడ వెదకుచున్నానే' అంటూ.

**మధురవాణి** : విశ్వనాథ తన నవలల్లో చిత్రించిన తెలుగు సామాజిక జీవితం మీకెవరికీ అందలేదు. ఆయన తర్వాత తిన్నగా నవల నిజాయితీగా రాసిన వాడేడి?

**తాపీ ధర్మా రావు:** అన్యాయంగా మాట్లాడకు. రావిశాస్త్రి అల్పజీవి, గోవులొస్తున్నాయి జాగ్రత్త, రాజు - మహిషి, దాశరథి రంగాచార్య జనపథం, జి.వి.కె. కీలుబొమ్మలు, బీనాదేవి హేంగ్ మిక్విక్, వట్టికోట ఆళ్వారు స్వామి ప్రజల మనిషి, గంగు యివన్నీ ఏమిటి?

**మధురవాణి** : నేను చెప్పినది బ్రిటిష్ వారి కాలంలో, డిప్రషన్ రోజుల్లో జీవితం గురించి - సరే. అదలా వుణ్నీండి. రైతుబిడ్డ సినిమా ఎలా తీశారు?

**తాపీ ధర్మా రావు:** అంటే (నవ్వు)

**మధురవాణి** : జమీందారుల సొమ్ముతో వాళ్ళకు తెలియకుండా జమీందారీ విధానాన్ని వ్యతిరేకించే చిత్రం తీయడం సాహసం కాదా!

**తాపీ ధర్మా రావు:** జమీందారీ భూస్వామ్యయుగం అంతరించి పోవలసినదే. ఏం చేస్తాం? కొన్ని అలా జరుగుతాయి. వాళ్ళకీ తెలుసు అంతరించి పోయేది తమ వ్యవస్థ అని.

**మధురవాణి** : అసలు మీరు రాకముందు సినిమాలకు స్క్రిప్ట్ అనేది వుండేది కాదంటారు. నిజమా?

**తాపీ ధర్మా రావు:** నువ్వు అడిగావు గనక చెబుతున్నా. అంతకుముందు డైరెక్టర్లు కవిగారు కూచుని ఏదో రాసుకుని దాన్నే మార్చుకుని తీసేవారు. నేను విధిగా స్క్రీన్ ప్లే రైటింగ్ డెవలప్ చేశాను. కవి చేసే పని కూడా డైరక్టరు చేయాల్సొచ్చేది. డైరక్టర్‌కి స్క్రీన్‌ప్లే చేతికంది వస్తే పని సులువు కాదా! బొమ్మ కూడా బాగా వస్తుంది.

**మధురవాణి** : దిన పత్రికల భాష గొడ్డు గ్రాంథికం వుండేదటగా మీరు రాకముందు.

**తాపీ ధర్మా రావు:** అవును. నేనే మొట్టమొదట వ్యావహారికంలో పత్రికా రచనచేసి చూపెట్టాను. శీర్షికలు వ్యాఖ్యలు అన్నీ సరళ వ్యావహారికంలో నడిపించాను జనవాణిలో. సంఘ సంస్కరణ ఆ వెనువెంటనే భాషా సంస్కరణా -

**మధురవాణి** : మాలపిల్ల సినిమాకి డైలాగులు చలం గారు రాశారా?

**తాపీ ధర్మా రావు:** స్క్రిప్ట్ వర్క్ నేను చేశాను. కొన్ని డైలాగులు ఆయన రాశారు.

**మధురవాణి** : సినిమాల వల్ల మీకు ఎక్కువ పేరొచ్చిందా? జర్నలిజం వల్లా?

**తాపీ ధర్మా రావు:** నేను పండితుడ్ని, వచన రచయితను, విమర్శకుడిని. వ్యావహారిక భాషకు వచనంలో శైలిని నిర్ధారించిన వాళ్ళలో ముఖ్యుడ్ని. రామ్మూర్తి పంతులు

గారి కలలు పండించిన శిష్యుడ్ని. సినిమా జర్నలిజం వల్ల పేరు రావడం నిమిత్త మాత్రం.

**మధురవాణి** : పెద్దల్ని కాదనడం; మీ సొంత మార్గాన కొత్త దారిని వెళ్ళడం మీకు సర్దా. అలా మీరొక చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించారు. అవునా?

**తాపీ ధర్మారావు** : నేను గాకపోతే మరొకరు చేసేవారు ఆ పని. ఎవరు లేకున్నా వున్నా ఆగేది కాదు. పండిత భిషక్కుల భాషాభేషజం నశించింది.

**మధురవాణి** : ఉన్న వాళ్ళ భాష, లేని వాళ్ళ భాష అంటూ భాషకు వర్గ స్వభావం అంటగట్టారు శ్రీశ్రీ. అది నిజమా?

**తాపీ ధర్మారావు** : అది ఒక దృష్టి. ఆ దృష్టితో చూస్తే అలానే కనిపిస్తుంది.

**మధురవాణి** : యద్భావం తద్భవతి అంటారు?

**తాపీ ధర్మారావు** : కాదు. మార్క్సిస్టు దృక్పథంలో చూస్తే అలా కనిపించి తీరుతుంది. రైటా రాంగా తర్వాత.

**మధురవాణి** : మీ భాషా మీ శైలిని అనుకరించే వారు ఒకరు వున్నారు. మీ తెలుగులో జాతీయాలు, సంస్కృతం కంటె తెలుగు ఎక్కువ వాడతారనుకుంటూ. ఎందుకంటే మీ జీవిత చరిత్రకు 'రాళ్ళు - రప్పలూ' అని మొరటైన పేరు పెట్టుకోవడం సాహసమా? (నవ్వు)

**తాపీ ధర్మారావు** : గతుకుల జీవితం అని చెప్పడం నా ఉద్దేశం.

**మధురవాణి** : మీ శైలిని తూచ తప్పకుండా అనుకరించే వాడు ఎ.బి.కె. అని గిరీశంగారు ఓసారి మాటల్లో అన్నారు.

**తాపీ ధర్మారావు** : గిరీశం ఎ.బి.కె. సంపాదకీయాలు చదువుతాడుగావల్ను. శ్రీశ్రీ షష్టిపూర్తికి పాపం వాడు జైల్లో వున్నాడు.

**మధురవాణి** : అన్నట్లు శ్రీ శ్రీ షష్టి పూర్తి సభకి మీ రధ్యక్షులట గదా! ఆరుద్ర అలక కూడా ఆ సభకు అదో ముచ్చట. శ్రీ శ్రీ గారి నెగెటివ్ దృక్పథాన్ని మీరు సమర్థిస్తారా?

**తాపీ ధర్మారావు** : నెగెటివ్ దృక్పథం అంటే -

**మధురవాణి** : మరేం లేదు. స్వాతంత్ర్యం వచ్చిందనుకోండి. ఆహా ఇది స్వాతంత్ర్యం కాదు. ఏదో వుందు అనటం. ఆంధ్ర రాష్ట్రం వచ్చిందనుకోండి. ఇది అది కాదు. యింకేదో అనటం. మనదేశంలో యిలా వుంది అని చెప్తామనుకోండి, యిది మనదేశం కాదు మరోటి అనడం.

**తాపీ ధర్మారావు** : అలా ఎవరంటున్నారు? శ్రీ శ్రీ యా -

**మధురవాణి** : ఈ స్వాతంత్ర్యం మేడి పండు అన్నది శ్రీ శ్రీ యే. నెగెటివ్ దృక్పథం అంటే-దీన్ని కాదని యింకెక్కడో ఏదో వున్నది అది యిక్కడకు తెస్తామని గప్పాలు కొట్టడం.

తాపీ ధర్మారావు : నాది అటునంటి మతం కాదు. నేను రష్యా భక్తుడ్నీ కాదు; చైనా భక్తుడ్నీ కాదు. అవును నువ్వు కాం(గెసు భక్తురాలివా?

మధురవాణి : కాను... కాను.. నాకు యం.యన్. రాయ్ నవ్య మానవతా వాదం నచ్చింది. ఎందుకంటే మానవ చైతన్యానికి హేతువాదానికి విలువని చ్చాడు రాయ్, మహానుభావుడు.

తాపీ ధర్మారావు : కమ్యూనిజానికి మానవతా వాదానికి చుక్కెదురు. రష్యాలో కమ్యూనిజం ఫెయిలయిందనా అలా అంటున్నావు?

మధురవాణి : ఒకప్పుడు బెజవాడను ఆంధ్రా మాస్కో అన్నారు. వాళ్ళ పేర్లు తగిలించు కోడం, వాళ్ళను తెగ అనుకరించడం - చివరికి అక్కడ స్టాలిన్ యుగం ఎప్పుడో అంతరించినా యిక్కడి తీ(వవాదులు స్టాలిన్ భజన చేస్తున్నారు యింకా.

తాపీ ధర్మారావు : కమ్యూనిజం పోయినా మార్క్సిజం ఒక సిద్ధాంతంగా ఒక దర్శనంగా యింకా వుంటుంది. పోతే ప్యూడల్ కమ్యూనిస్టులు పోతారు.

మధురవాణి : రెడ్ స్క్వేర్‌లో లెనిన్ మసోలియంలోని లెనిన్ భౌతిక కాయాన్ని లేపేసార్ట. ఆయన స్మృతికి మహా అపచారం కాదా?

తాపీ ధర్మారావు : గౌరవ అగౌరవాలు మానావమానాలు (బతికి వున్న మనకి గాని అమరజీవు లైన ఆ మహాత్ములకు కాదు. మీరు పూజించినా దూషించినా అవి వారిని అంటవు.

మధురవాణి : యింటికి జేష్టాదేవి, పొరుగ్కి (శ్రీ మహాలక్ష్మి అన్నట్లు వుంటాయి మనవారి సుత్తీ కొడవలి మార్కు చేష్టలు. వీళ్ళని ఆత్మ విధ్వంసకులు అన్నా తప్పు లేదు.

తాపీ ధర్మారావు : నువ్వు పొరబడుతున్నావు మధురవాణీ. (పతి సిద్ధాంతం ఆచరణలో మనుష్యుల వలననే (భష్టు పడుతుంది. కమ్యూనిస్ట్ పార్టీ కూడా అలానే (పజల్ని విస్మరించి సిద్ధాంతాల్ని పట్టుకుని పిడివాదాలు చేసి నానా (భష్టూ అయింది. అది ఎప్పుడు ఒక మతం స్థాయికి తిరుగులేని వేదాంతంగా మారిందో అప్పుడే నియంతృత్వ పోకడలు అవాంఛనీయ దోరణులూ తలెత్తి మొత్తం తుడిచి పెట్టుకుపోయేలా చేశాయి. యీ జబ్బును కొంతవరకు రాయ్ ముందుగానే పసికట్టాడు.

మధురవాణి : ఏది ఏమైనా నాటకాలు, సినిమాలు, సామాజిక స్ప్రుహగల కథలు వచ్చి సాహిత్యాన్ని సుసంపన్నం చేయలేదా? కుటుంబరావు గారు యిప్పు డుంటే యిదంతా చూసి ఏమంటారో?

(ఇంకా వుంది)



# సాహిత్యంలో నిబద్ధత అంటే ఏమిటి? యెంత మేరకు?

-రాచమల్లు రామచంద్రారెడ్డి

నిబద్ధత అంటే ఒక సిద్ధాంతానికి కట్టుబడడం లేదా ఒక భావజాలానికి అంటే ఒక ఐడియాలజీకి కట్టుబడడం. కమిట్‌మెంట్ అనే యింగ్లీషు మాటకు తెలుగు అనువాదమే నిబద్ధత.

నిబద్ధత అనేది రచయితలకు అనాదిగా వున్నదే. కానీ నిబద్ధత అనే మాట వ్యాప్తిలోకి రావడమూ రచయితలకు నిబద్ధత వుండాల్నా వుండకూడదా అనే సమస్య మీద వాదోపవాదాలు జరగడమూ యీ శతాబ్దంలోనే. యీ పరిణామానికి చారిత్రక కారణాలున్నాయి.

నన్నయ సంస్కృత భారతాన్ని తెలుగులోకి యెందుకు అనువదించినాడు? తాను నమ్మిన మతాన్ని ప్రచారం చేయడానికే. ఆయన నమ్మినమతం వైదిక మతం, ఈ వైదికమతమే హిందూమతం కాదు. ఇది హిందూమతంలో ఒక శాఖ మాత్రమే. బౌద్ధమతమూ జైనమతమూ చార్వాకము హిందూమతంలో శాఖలు కాదనుకున్నా, ద్వైతం, అద్వైతం, సాంఖ్యం, వైష్ణవం, వీరశైవం లాంటివి నిశ్చయంగా హిందూమతంలో శాఖలే. వైదికమతం కూడా అలాంటి ఒకశాఖే, అయితే యిది వేదకాలం నాటి హిందూమత రూపం. ఇతర శాఖలలో యజ్ఞయాగాదులకూ వర్ణ వ్యవస్థకూ విలువలేదు. కానీ వైదికమతంలో యజ్ఞయాగాలూ అగ్ని పూజలాంటి వైదికకర్మలకు అపారమైన విలువవుంది. ఆ కర్మలు చేసే బ్రాహ్మణ వర్గానికి అపారమైన ఆధిక్యం వుంది. తద్వారా వర్ణ వ్యవస్థకు గొప్ప విలువ వుంది. ఆ కర్మలన్నీ మంత్ర సహితమైనవని కూడా జ్ఞాపకం పెట్టుకోవాలి.

'దైవాధీనం జగత్సర్వం/మంత్రాధీనంతు దైవతం/తన్మంత్రం బ్రాహ్మణాధీనం/బ్రాహ్మణోమమదేవతా' అనే శ్లోకం వైదికమత సారాన్ని నాలుగు మాటల్లో వెల్లడిస్తుంది. జగత్తంతా దైవాధీనమట, ఆ దైవం మంత్రాధీనమట, ఆ మంత్రం బ్రాహ్మణాధీనమట, బ్రాహ్మణులు మనదేవతలట. మంత్రాలంటే తేలుమంత్రమూ పాము మంత్రమూ కాదు. యజ్ఞయాగాదులలో వల్లించే వైదిక మంత్రాలే. ఆ వైదిక మతంమీద తిరుగుబాట్లుగా వచ్చినవే బౌద్ధ జైన మతాలు. ఈ మతాలు జగత్తంతా దైవాధీనమనేమాట ఒప్పుకోలేదు; మంత్రాల విలువనూ యజ్ఞయాగాది కర్మల విలువనూ పూర్తిగా నిరాకరించినాయి; బ్రాహ్మణాధిక్యాన్నీ దానివెంట మొత్తం వర్ణ వ్యవస్థనూ తోసిపుచ్చినాయి. అంటే వైదిక మతంలోని పునాదులనే యివి పెకలించి వేసినాయి. ఈ విప్లవాత్మకమైన సత్యాన్ని గమనించకుండా జైనబౌద్ధాలను కేవలం అహింసావాదాలని గ్రహించడం ఆ మతాలను వక్రీకరించడమౌతుంది. వాటికి మహా అపచారమౌతుంది. అవి కేవలం అహింసా మతాలే అయితే కింది కులాల వాళ్ళూ స్త్రీలూ తండోప తండాలుగా వచ్చి వాటిలో చేరి వుండరు. వాటిని అంత పట్టుదలతో వ్యతిరేకించవలసిన అవసరం బ్రాహ్మణులకు వుండేదీ కాదు.

అనేక కారణాలవల్ల తెలుగుదేశంలో బౌద్ధమతం క్షీణించినప్పుడు వైదికమత పునరుద్ధరణకు అవకాశం వచ్చింది. ఆ తరుణంలో వైదికమత విశ్వాసాలుగల రాజరాజనరేంద్రుడు భారతం అనువదించమని కోరడమూ అచ్చం వైదిక బ్రాహ్మణుడైన నన్నయ అనువదించడమూ జరిగినాయి. ఆ రాజు తన కోరిక వెల్లడించేటప్పుడు యిలా అన్నాడట 'ఇవి యేమనన్ సతతంబు నాయెడ కరంబిష్టంబులై యుండు - అని ఒక పద్యం వుంది. నన్నయ రాసిందే. ఆ రాజుకు అయిదు విషయాలు యెల్లప్పుడూ మహా యిష్టమట. మొదటిది భూదేవ కులాభితర్పణం, అంటే బ్రాహ్మణులను తృప్తిపరచడం. తరువాత భారతం మీద ఆసక్తి, శివపూజా, సాధుసాంగత్యమూ, దానశీలతా వున్నాయనుకోండి. బ్రాహ్మణభక్తి మొట్టమొదటిదే కావడం గమనించదగింది. తెలుగుభారతం చదివితే మనకు బ్రాహ్మణాధిక్యమూ యితర వైదికమత భావాలూ కొల్లలుగా కనిపిస్తాయి. నన్నయ వైదిక మతానికి నిబద్ధుడన్నమాట. భారత రచనకు పూనుకోవడంలోనే ఆ నిబద్ధత కనిపిస్తుంది. అంతేకాక 'నానా రుచిరార్థసూక్తినిధి నన్నయ భట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్' అని నన్నయ్యే అన్నాడు. తాను జగద్ధితంగా భారతం రాసినాడట, అంటే జగత్తుకు హితం కలిగేటట్లుగా, అంటే వైదికమతం జగత్తుకు మేలుచేస్తుందని నన్నయ నమ్మకం, అంటే ఒక ప్రయోజనం కొరకు భారతం రాస్తున్నానని ఆయనే చెప్పుకున్నారు. అంటే నన్నయకు నిబద్ధత వుండడమే కాదు తనకు నిబద్ధత వుందనే గుర్తింపు కూడా వుంది.

అయితే సంస్కృతంలో భారతం రాసిన వ్యాసుని మాట యేమిటి? రామాయణం రాసిన వాల్మీకి మాట యేమిటి? వాళ్ళ కాలం నాడు వైదికమతం సమాజమంతటా అమల్లో వుంది. కనుక కొత్తగా ప్రచారం చేయవలసిన అవసరమేమీలేదు. కానీ ఆ మతంమీద వాళ్ళకు విశ్వాసం ఉంది. దానికి కట్టుబడే వాళ్ళు రచనలు చేసినారు, అంటే వాళ్ళకు కూడా నిబద్ధత అనేది వుంది.

నన్నయ తరువాత భారతం రాసిన తిక్కన యజ్ఞం చేసినవాడు. అందుకే ఆయనకు తిక్కన సోమయాజి అనే పేరు వచ్చింది. కనుక ఆయనకు వైదిక మతం మీద విశ్వాసం వుందని చెప్పనక్కరలేదు. అయితే ఆనాటికి వైదికమత ప్రాబల్యం తగ్గిపోయి భక్తిప్రధానమైన శైవమూ వైష్ణవమూ వ్యాప్తిలోకి వచ్చినాయి. ఆ రెండు మతాల మధ్య సామరస్యం కలిగించడానికి హరిహరనాథుడనే కొత్త దేవుడు ఆవిర్భవించినాడు. తిక్కన తన భారతం హరిహరనాథునికి అంకితమిచ్చినాడు గానీ హరిహరనాథ మతాన్ని ప్రచారం చేయడానికి యే రచనా చేయలేదు. ఆయన రాసిన భారతమూ, ఉత్తర రామాయణమూ వైదిక మతాన్ని ప్రచారం చేసేవే. ఆ మతంపట్ల ఆయనకు గాఢమైన నిబద్ధత వుంది. పోతన రాసిన భాగవతం భక్తి ప్రధానమైనది. ఆయన గొప్ప దైవభక్తుడు. దైవభక్తిని ప్రచారం చేయడమే ఆయన రచన ఉద్దేశం. ...సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్' అని పోతన్నే చెప్పుకున్నాడు. నన్నయలాగే పోతన కూడా జగత్తుయొక్క హితం కోసం రచన చేస్తున్నట్లు చెప్పుకున్నాడు. అంటే పోతన్నకు కూడా నిబద్ధత వుండడమే కాక తనకు నిబద్ధత వుందనే గుర్తింపు కూడా వుంది.

శివకవులు యింకా యెక్కువ దీక్షతో మతప్రచారం కొరకు గ్రంథాలు రాసినారు. వీరి శైవం మహా ఉద్దండమైన మతం. వాళ్ళ శివభక్తి ముందర యే లౌకిక ధర్మాలూ యే లౌకిక నీతులు నిలవలేదు. చాలా దారుణంగా వుండేది శివకవుల నిబద్ధత.

తెలుగులో నిబద్ధత యేమీలేని మొదటి రచనలు ప్రబంధాలే. ప్రబంధ కవులకు నీతులూ ధర్మాలూ మత విశ్వాసాలు గాఢంగానే వుండేవి. కాని వాళ్ళ రచనల్లో వాటికేమీ స్థానం లేదు. వస్తువులో శృంగారమూ, శిల్పంలో పద్య నిర్మాణగతమైన అందమూ వాళ్ళ లక్ష్యాలు.

ఈ శతాబ్దంలో వచ్చిన భావకవులలో కూడా నిబద్ధత కచ్చితంగా వుంది. వాళ్ళ యితివృత్తాలు ప్రధానంగా రెండే-వ్యక్తి స్వేచ్ఛా, ప్రణయమూ. ఆనాటికి దేశంలో స్వాతంత్ర్య పోరాటం జరుగుతూనే వుంది. కనుక దేశభక్తి అనేది మూడవ యితివృత్తమైంది. ఈ మూడు ఫ్యూడల్ సంస్కృతి మీద తిరుగుబాటుగా వచ్చిన బూర్జువా సంస్కృతిలో భాగాలే. భావకవులు వీటిని యెంతో నిబద్ధతతో కావ్యస్థం చేసినారు. అయితే వాళ్ళకు యెంత నిబద్ధత వున్నా నిబద్ధత అనే మాట ఆనాటికి పుట్టలేదు. వాళ్ళు ఒక కొత్త కవిత్వ సంప్రదాయాన్ని ప్రవేశపెట్టినామని అనుకున్నారే గాని, ఒక కొత్త భావజాలాన్ని ప్రచారం చేస్తున్నామని అనుకోలేదు. అంతేకాక అది సమాజంలో బూర్జువా ప్రజాతంత్ర భావాలు వ్యాపిస్తున్న కాలం గనుక పెద్ద పోరాటం అవసరం లేకుండానే భావకవిత్వం విద్యావంతుల ఆదరణ పొందింది. అందువలన నిబద్ధతను గురించిన స్పృహయే వారికి కలగలేదు. నిబద్ధత అనే మాటతో అవసరమూ కలగలేదు.

భావ కవిత్వంతోపాటు మనకు వచన సాహిత్యం కూడా వచ్చింది. అంటే కథలూ నవలలూ. యివి రాసినవాళ్ళు ఒక్క విశ్వనాథ సత్యనారాయణ తప్ప బహుశా అందరూ బూర్జువా విలువలను మన్నించినవాళ్ళే. చలంలో ఎన్ని విప్లవాత్మక భావాలున్నా అవన్నీ బూర్జువా విలువలకు అనుగుణమైనవే.

అయితే నిబద్ధత అనే మాట యెప్పుడు పుట్టింది? మార్క్సిజం అనేది సమగ్రమైన ఆర్థిక సాంఘిక రాజకీయ సిద్ధాంతం. అది అన్ని రంగాలలోనూ మౌలికమైన మార్పులు తేవాలంటుంది. మార్క్సిజంను నమ్మే రచయితలు, అంటే వామపక్ష రచయితలు సహజంగానే తమ రచనల్లో ఆ భావజాలాన్ని చిత్రిస్తారు. అంతేకాదు; చిత్రించాలనే ఉద్దేశ్యంతోనే చిత్రిస్తారు. తమ భావ జాలానికి ప్రచారం జరగాలనే ఉద్దేశ్యంతోనే పాఠకులను తమ భావజాలం వైపు తిప్పుకోవాలనే ఉద్దేశ్యంతోనే చిత్రిస్తారు. భావకవిత్వం నాటి బుర్జువా రచయితలకు నిబద్ధత వుంది గానీ తమకు నిబద్ధత వుందనే గుర్తింపు వాళ్ళకు లేదు. వామపక్ష రచయితలకు నిబద్ధత వుండడమేకాక తమకు నిబద్ధత వుందనే గుర్తింపు కూడా వుంది. అంతేకాదు తమకు నిబద్ధత వుండాలనే పట్టుదల కూడా వుంది. వామపక్ష రచయితలు నిబద్ధత అవసరాన్ని గుర్తించినప్పుడు నిబద్ధత అనే మాటను సృష్టించుకున్నారు.

ప్రబంధ కవులకు తప్ప నన్నయ మొదలుకొని అందరికీ ప్రచారదృష్టి వున్నట్లే కనపడుతుంది. భావకవిగా ప్రారంభించి సనాతనవాదిగా మారిన విశ్వనాథ సత్యనారాయణకు యీ దృష్టి చాలా యెక్కువగా వుండేది. లేకపోతే ఆయన విద్యుచ్ఛక్తినీ సాగునీటి పథకాలనూ వ్యతిరేకిస్తూ కూటవాదాలు సృష్టించి వుండడు. ప్రేమనూ ప్రేమ వివాహాలనూ ఖండిస్తూ కుతర్కాలు కల్పించి వుండడు.

సమాజాన్ని మార్చాలనే ఉద్దేశం వున్నప్పుడు రచయితలకు విధిగా ప్రచార దృష్టి వుంటుంది. అందుకే వామపక్ష రచయితలకు గాఢమైన నిబద్ధత వుండడం. అయితే యీనాటి సమాజంలో వామపక్ష భావజాలాన్ని వ్యతిరేకించే వాళ్ళు చాలామందే వున్నారు. వాళ్ళు

మొత్తం మీద యీనాటి పెట్టుబడిదారీ సమాజాన్ని సమర్థించే వాళ్ళు, ఈ వ్యవస్థే కొనసాగాలని కోరేవాళ్ళు. అంటే వాళ్ళకూ ఒక భావజాలం వుంది. దాని వెంట నిబద్ధతా వుంది. కాని వాళ్ళలో కొందరు నిబద్ధతను ఖండిస్తారు. రచయితలకు నిబద్ధత అనేది గుదిబండ అనీ బందిఖానా అనీ వాదిస్తారు. నిజానికి వాళ్ళు వ్యతిరేకించేది వామపక్ష భావజాలాన్ని. కాని ఆ భావజాలాన్ని సూటిగా యెదుర్కోకుండా నిబద్ధతను ఖండిస్తారు.

ఇటీవలి కాలంలో మరొక పరిణామం కనిపిస్తుంది. కొందరు రాజకీయ నాయకులు రచయితలకు సందేశాలు యిచ్చేటప్పుడు రచయితలు సమాజ శ్రేయస్సుకు ఉపకరించే రచనలు చేయాలని ఉద్బోధిస్తుంటారు. అంటే రచయితలకు నిబద్ధత వుండాలని వాళ్ళు అంటున్నారు. అయితే నిబద్ధత అంటే యేదో ఒక భావజాలంపట్ల నిబద్ధతే. యే భావజాలాన్నీ ఆశ్రయించకుండా నిబద్ధత అనేది వుండజాలదు. మరి మన రాజకీయ నాయకులు యే భావజాలం ద్వారా సమాజ శ్రేయస్సు కలుగుతుందో చెప్పకుండా సమాజశ్రేయస్సు కొరకు రచనలు చేయాలని ఉపదేశాలు యివ్వడం వాళ్ళ రాజకీయ మాయాజాలంలో ఒక భాగమే అనుకోవాలి.

సాహిత్యంలో నిబద్ధత అంటే యేమిటో వివరించినా ననుకొంటాను. ఇక అది యెంత వరకు అనే ప్రశ్న మిగిలివుంది. సాహిత్యంలో నిబద్ధత యెంతవరకు అంటే సాహిత్యమనే మాటలోనే జవాబు యిమిడివుంది. నిబద్ధత యెంత వున్నా ఆ రచన సాహిత్యంగా వుండాలి. అంటే కథ కథగా వుండాలి. నవల నవలగా వుండాలి. కవిత్వము కవిత్వంగా వుండాలి. అప్పుడే అది పాఠకుని హృదయం మీద పనిచేస్తుంది. రచనలో సాహిత్యగుణం లేకుండా వట్టి భావజాలం మాత్రమే వుంటే అది వట్టి ప్రచారమే అవుతుంది. దాన్ని యే పాఠకుడూ నమ్మడు. సాహిత్యగుణం వుండాలంటే రచనకు మంచి శిల్పం వుండాలి. అది జీవితాన్ని ప్రతిబింబించాలి లేదా యేదో ఒక జీవితవాస్తవాన్ని వెల్లడించాలి. శిల్పమూ వాస్తవికతా-యివి రెండూ సాహిత్యానికి ముఖ్య లక్షణాలు. ఇవి లేకుండా మంచి సాహిత్యం వుండదు. సాహిత్యమంతా ప్రచారమే అనేమాట నిజమే. కానీ ప్రచారమంతా సాహిత్యం కాదు.

(రా.రా. స్మారక సమితి సౌజన్యంతో)

Motivation and free will are more important than behaviour determinimism in shaping the course of human life, and the accident play larger role in history.



Humanness cannot be understood by reducing man to something less than human and ignoring the complexity which make for the unique richness of his life.

# విజ్ఞానం - విజ్ఞత

- అట్లూరి వెంకటేశ్వరరావు

పరిసరాలను గూర్చిన సమాచారాన్ని మనం సేకరించుకొంటాం. వ్యవస్థీకృతమయిన సమాచారాన్ని విజ్ఞానం అంటాం. విజ్ఞానాన్ని పుస్తకాల నుండి కాని, ఇతరుల నుండి వినిగాని సేకరించు కొంటాం. కొన్ని అనుభవాలు ప్రత్యక్షంగా విజ్ఞానాన్ని కలుగజేస్తాయి. విజ్ఞానం మనకు బయట నుండి లభిస్తుంది. విజ్ఞానాన్ని విషయ పరిజ్ఞానంగా వస్తుగత దృక్కోణం నుంఢి పరిశీలించి అవగాహన చేసుకొంటాం. ఆ దశలో విజ్ఞానం వేరు, మనం వేరు అనే భావం కల్గుతుంది. విజ్ఞానాన్ని జ్ఞాపకంగా మెదడులో పదిలపర్చుకొంటాం. గతాన్ని గూర్చిన సమాచారం జ్ఞాపకంగా వుంటుంది. అట్టి జ్ఞాపకాన్ని మన అవసరాల మేరకు ఎప్పుడయినా తిరగదోడగలం.

మనం సేకరించిన విజ్ఞానంలో కొంత భాగం మన సహజ స్వభావంగా మనలో ఐక్యమయిపోతుంది. నిప్పు కాలుతుందనే విజ్ఞానాన్ని అనుభవ పూర్వకంగా తెల్సుకొన్న పిదప, నిప్పును చూడగానే అసంకల్పితంగా భద్రతా చర్యలను చేపడ్తాం. మన భద్రతా వాంఛ మన సంరక్షణను స్వచ్ఛందంగా చూచుకొంటుంది. తత్ఫలితంగా మనం అసంకల్పితంగా ప్రమాదాలను నివారించుకో కలుగుతాం. ఆ దశలో కార్యకారణాల సంబంధాలను గూర్చి ఆలోచించకుండా సమయస్ఫూర్తితో వ్యవహరిస్తూ వుంటాం. అట్టి ప్రవర్తనకు మన విజ్ఞత రూపకల్పన చేస్తుంది. మనం సంపాదించిన విజ్ఞానంలో కొంతభాగం విజ్ఞతగా మనలో ఇమిడిపోతుంది. అట్టి విజ్ఞత మన స్వభావానికి రూపకల్పన చేస్తుంది. మనలో ఇమడని విజ్ఞానం జ్ఞాపకంగా వుండి కార్యకారణాల సంబంధాల ద్వార మన ఆలోచనలలోనికి వచ్చి మన సమస్యా పరిష్కార శక్తికి మూలాధారంగా వుంటుంది.

మన సమస్యా పరిష్కార శక్తి మనం సముపార్జించిన విజ్ఞానంపై ఆధారపడి వుంటుంది. మనం ఆకళింపు చేసుకొన్న విజ్ఞానం విజ్ఞతగా మనలో ఇమిడిపోయి మన సహజ స్వభావంగా అసంకల్పితంగా బహిర్గత మౌతుంది. అప్పుడు మనమూ, మన విజ్ఞానమూ ఐక్యమయిపోతాం. అట్లా విజ్ఞతగా రూపాంతరం చెందని విజ్ఞానం జ్ఞాపకంగా వుంటుంది. సమస్యలను పరిష్కరించుకొనే సందర్భాలలో జ్ఞాపకంగా వున్న విజ్ఞానం అనేక పరిష్కారాలను సూచిస్తుంది. మన వివేకం వాటి మంచి చెడ్డలను బేరీజు వేస్తుంది. మన విషయ పరిజ్ఞానం ఆ పరిష్కారాల సాధ్యా అసాధ్యాలను కార్యాచరణ సంబంధాల నేపథ్యంలో పరిశీలిస్తుంది. చివరకు లాభనష్టాలను అంచనా కట్టుకొని మన కార్య విధానాన్ని రూపొందించు కొంటాం ఈ పనంతా బాహ్య మనస్సు పరిధిలో జరుగుతుంది. అనేక సందర్భాలలో బాహ్య మనస్సు ప్రమేయం లేకుండానే అంతర్ మనస్సు ప్రేరణ వల్ల అసంకల్పితంగా పరిష్కారాలను అమలు జరుపుతాం. అట్టి ప్రవర్తనకు మనలో ఇమిడి పోయిన విజ్ఞానం కారణ భూతమవుతుంది. బాహ్యమనస్సు వస్తుగత దృక్కోణం నుండి విజ్ఞానాన్ని పరిశీలించి అనుభవాల నేపథ్యంలో ఆత్మగత నిర్ణయాలను చేస్తుంది. కాని అంతర్ మనస్సు పూర్తిగా ఆత్మగత ధోరణిలోనే వ్యవహరిస్తుంది. బాహ్య మనస్సు, అంతర్ మనస్సు రెండూ ఒకే మార్గాన్ని అనుసరించితే మనలో అంతర్గతంగా వున్న శక్తి ఏకీకృతమై మనం చేపట్టిన పనిని పటిష్టంగా నిర్వహించటానికి తోడ్పడుతుంది. కాని బాహ్యమనస్సు ఒక దారిని, అంతర్ మనస్సు ఇంకొక దారిని పయనిస్తే అంతర్గత సంఘర్షణ ఏర్పడుతుంది. అప్పుడు మనశక్తి సంపూర్ణంగా కార్యాచరణకు ఉపయోగపడదు. చాలావరకు వృథా అయిపోతుంది.

## విజ్ఞానం గతానికి సంబంధించింది

పూర్వ జ్ఞాపకాలు విజ్ఞానానికి పునాదిగా వుంటాయి. జ్ఞాపకాలను తిరగదోడి సమస్యలకు పరిష్కారాలను కనుగొనే సందర్భాలలో మనం తరచు గతంలోకి వెళ్ళి గత స్మృతులను మననం చేసుకొంటాం. కాని విజ్ఞత వర్తమానంతో సంబంధం కలిగి వుంటుంది. అందువల్ల సమయస్ఫూర్తితో వ్యవహరిస్తుంది. విజ్ఞత, విజ్ఞానం లాగ కొంత శక్తిని గతాన్ని గూర్చి నెమరు వేయడానికి వినియోగించుకోదు కాబట్టి మనలో అంతర్ గర్భితంగా వున్న శక్తి అంతా వర్తమానంలో ఎదురయిన సమస్యలను పరిష్కరించుకోవడానికి ఉపయోగపడ్తుంది. తత్ఫలితంగా విజ్ఞతతో వ్యవహరించే వారు సత్వర నిర్ణయాలు చేయగలుగుతారు. తాము చేసిన నిర్ణయాలను అంకిత భావంతో అమలు జరుపగలుగుతారు. అట్టి వారి నిర్ణయాలతో ఏకీభవించని వారు కూడ వారి కార్య నిర్వహణ సామర్థ్యాన్ని గుర్తించి ప్రశంసిస్తారు. అందువల్ల విజ్ఞానాన్ని విజ్ఞతగా మార్చుకోవడానికి ప్రతి ఒక్కరు కృషిచేయాలి.

మనం నిరంతరం విజ్ఞానాన్ని సేకరిస్తూ వుంటాం. ఆ విజ్ఞానాన్ని ఆకళింపు చేసుకొని కొంత భాగాన్ని విజ్ఞతగా మనలో ఇముడ్చుకొంటూ వుంటాం. విజ్ఞత మన వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడుతుంది. విజ్ఞానం ఇతరుల నుండి మనకు సంక్రమిస్తుంది. కాని విజ్ఞతను ఒకరి నుండి ఇంకొకరికి బదలాయించటానికి వీలుపడదు. విజ్ఞతను నూతిలో నీళ్ళు తోడుకొన్నట్లు మనకు మనమే బహిర్గతం చేయాలి. నూతిలోని జలపాతంలా విజ్ఞత తోడిన కొద్ది వూరుతుంది. విజ్ఞతను వినియోగం చేసుకోకపోతే పాడుబడ్డ నూతిలా చెడిపోతుంది. అప్పుడు ఇతరులపై ఆధారపడి జీవించాల్సి వస్తుంది. ఇతరుల విజ్ఞతను మనం అమలుపర్చటంలో సిద్ధహస్తులవుతాం. మన విజ్ఞతపై మనకు నమ్మకం కుదరదు. తత్ఫలితంగా ఆత్మ విశ్వాసం వృద్ధి చెందదు. ఆత్మ న్యూనతా భావంతో అసమర్థులుగా వుండిపోతాం. ఇట్టి వ్యక్తిత్వ లోపాన్ని ఆసరాగా తీసుకొని సమాజం మనను చులకనగా చూస్తుంది. మన అమాయకత్వాన్ని స్వార్థపరులు తమ అవసరాలకు ఉపయోగించుకొంటారు. అట్టి వారి విషయ పరిజ్ఞానం వారి చొరవను కుంటుపరుస్తుంది. ప్రతి విషయాన్ని విశ్లేషించటానికి విషయ పరిజ్ఞానం ఉపయోగపడినప్పటికీ, వారి ఆత్మ న్యూనతా భావం భయాన్ని ప్రేరేపిస్తుంది. ప్రమాదం పొంచి వుందనే భావంతో ముందుకు సాగలేకపోతారు. తత్ఫలితంగా జీవితంలో ఎదురయ్యే సవాళ్ళను పరిష్కరించుకోలేక ఇతరుల వత్తాసు కొరకు వేచి వుండటం నేర్చుకొంటారు.

తార్కిక శక్తి, విజ్ఞానాన్ని సమకూర్చుకొనే స్థోమతను కలుగజేస్తుంది. తార్కిక శక్తి మనను మన విజ్ఞానాన్ని వేరువేరుగా పరిగణిస్తుంది. విజ్ఞానం లోతు లేని పైపై అంశంగా వుంటుంది. విజ్ఞానం విజ్ఞతగా రూపాంతరం చెందినప్పుడు గంభీరతను సంతరించుకొంటుంది. విజ్ఞత భాషకు అతీతంగా వుంటుంది. విజ్ఞత అంతర్ దృష్టి కలిగి వుంటుంది. విజ్ఞత వ్యక్తియొక్క సహజ జ్ఞానంగా బహిర్గతమవుతుంది. అందువల్ల కార్యకారణ సంబంధాల ద్వార విజ్ఞతను వివరించటానికి వీలుపడదు. పర్యవసానంగా భాష విజ్ఞతను తెలియజెప్పలేకపోతుంది. విజ్ఞానాన్ని సూక్ష్మాతి సూక్ష్మ అంశాలుగా విభజించి వివరించగల భాష విజ్ఞతను మాటల ద్వార ఇతరులకు అందజేయలేకపోతోంది. సహజ జ్ఞానం వివరణలకు అతీతంగా వుంటుంది. అంతర్ దృష్టి మనోఫలకంపై వున్న చిత్రాలను చూస్తుంది. అనుభూతులను పొందుతుంది. కాని వాటిని ఇతరులకు వివరించలేక పోతుంది. విజ్ఞానం ఒక స్థాయిలో వుండగా, విజ్ఞత ఇంకొక స్థాయిలో వుంటుంది. విజ్ఞానం వుపయోగించుకొనే భాష వేరు. విజ్ఞత అందించే

సంకేతాలు ఇంకొక భాషలో వుంటాయి. విజ్ఞత యొక్క భాష వ్యక్తికే పరిమితమయి వుంటుంది. లోకజ్ఞానం విజ్ఞానానికి ఆయువు పట్టు. కాని విజ్ఞత అంతర్ దృష్టితో వ్యవహరిస్తుంది. అనేక సందర్భాలలో లోకజ్ఞానంతో సంబంధం లేకుండా విజ్ఞత వ్యక్తీకరింపబడుతుంది.

కంప్యూటర్లు తార్కిక శక్తి కలిగి వుంటాయి. సమాచారాన్ని సేకరించి వ్యవస్థీకృతం చేస్తాయి. మనం ఆదేశించిన రీతిలో సమాచారాన్ని విజ్ఞానంగా మార్చి అందిస్తాయి. అట్లాగే మరమనిషి మనం అందించిన విజ్ఞానాన్ని ఉపయోగించుకొని తార్కిక శక్తిని ప్రేరేపించి కొన్ని పనులను చేయగలదు. కంప్యూటర్లు, మరమనిషి మానవుల కన్నా చాకచక్యంతో కొన్ని పనులను చేయగలవు. కాని అవి విజ్ఞానాన్ని విజ్ఞతగా మార్చుకోలేవు, పర్యవసానంగా వాటికి అహంకారం వుండదు. విజ్ఞానాన్ని యాంత్రికంగా ఉపయోగించుకొని, ముందుగా నిర్ణయించిన రీతిలో అవి వ్యవహరిస్తాయి. వాటికి వస్తుగత దృక్కోణం తప్ప ఆత్మగత దృక్కోణం వుండదు. పూర్తిగా వస్తుగత దృక్కోణం నుండి సమస్యలను పరిశీలించగల్గిన వారు కూడ కంప్యూటర్లు లాగా వ్యవహరిస్తూ వుంటారు. మనకు విజ్ఞత ఆత్మగత దృక్కోణాన్ని కూడ కలుగజేస్తుంది. తత్ఫలితంగా ఆత్మాభిమానంతో వ్యవహరిస్తాం. అందువల్ల విజ్ఞానం మనకు అటు వస్తుగత దృష్టిని ఇటు ఆత్మగత దృష్టిని సమన్వయం చేసుకోగల స్థోమతను కలిగిస్తుంది. కాని ఈ రెండు అంశాలు అందరికి సమాన నిష్పత్తిలో వుండవు. కాబట్టే వ్యక్తుల విషయ నిర్ణయ విధానాలలో తేడాలు కన్పిస్తాయి. ఆ వ్యత్యాసాలే వ్యక్తిత్వ లక్షణాలుగా స్థిరపడిపోతాయి. విజ్ఞత వ్యక్తిత్వానికి మూల స్తంభం.

విజ్ఞానాన్ని మనం ఆకలింపు చేసుకొని అనుభవం లోనికి మార్చుకొంటాం. అనుభవం అనుభూతిని కలుగజేస్తుంది. అనుభూతిలో కొంతభాగం విజ్ఞతగా మనలో ఇమిడిపోతుంది. మిగిలిన అనుభూతి జ్ఞాపకంగా మెదడులో వుంటుంది. జ్ఞాపకంలో వున్న అనుభూతులు విజ్ఞతగా మారలేదని తెల్సుకోవాలి. సమస్యలను పరిష్కరించుకోవడానికి ఈరెండు అవసరం. పూర్తిగా తార్కిక వాదంపై ఆధారపడి బాహ్య మనస్సు ప్రభావానికి లోనయి విజ్ఞానాన్ని ఉపయోగించుకొంటూ యాంత్రికంగాను వ్యవహరించవచ్చు; లేక అంతర్ మనస్సు ప్రభావానికి లోనయి ఆధ్యాత్మిక దృక్పథంతో అంతరాత్మ ప్రబోధించినట్లుగాను కూడ వ్యవహరించవచ్చు. ఒకటి పూర్తిగా హేతుబద్ధంగా కనిపిస్తే రెండవ ధోరణి అనేక సందర్భాలలో నిర్హేతుకంగా కన్పిస్తుంది. ఈ రెండు పంథాలను పాక్షికంగా గ్రహించి మన సమస్యలను పరిష్కరించుకొంటూ వుంటాం. ప్రతి ఒక్కరి వ్యక్తిత్వంలోను ఈ మిశ్రమాల నిష్పత్తి కన్పిస్తూ వుంటుంది. ఎవరికి వారే తమ ఆలోచనలను గుణాత్మక పరిశీలన చేసుకొంటే ఈ నిష్పత్తి స్పష్టంగా కన్పిస్తుంది.

కొంతమంది పూర్తిగా బాహ్యమనస్సు ప్రభావానికి లోనయి తమ విషయ పరిజ్ఞానాన్ని కారణ కార్య సంబంధాల ఆధారంతో ఇతరులకు అర్థమయ్యేటట్లు వివరించగలుగుతారు. అట్టివారు ఇతరుల నుండి కూడ అటువంటి వివరణల కొరకు ఎదురు చూస్తారు. తమకు సంతృప్తి కలిగించే వివరణలను ఇవ్వలేని వారితో వివాదాలకు దిగుతారు. కొన్ని సందర్భాలలో వివాదాలు పోట్లాటలుగా మారి ఉద్రిక్తతను కలుగజేస్తాయి. తరచు ఇతరులతో పోట్లాడువారు తమను ఎవరూ అర్థం చేసుకోవడం లేదని ఇతరులను నిందిస్తూ తమ ప్రవర్తనను సమర్థించుకొంటారు. ఎవరో ఒకరితో ఎప్పుడో ఒకసారి వివాద మేర్పడితే అది ఇతరుల తప్పుకావచ్చు.

కాని పరిస్థితులేమయినా, సంఘటనలేవయినా, పరిసరాలు ఎటువంటివయినా, వ్యక్తులెవర యినా, తరచు వివాదాల సుడి గుండంలో పడి కొట్టు మిట్టాడే వారు మాత్రం తమ విజ్ఞానాన్ని ప్రదర్శించి ఇతరులపై ఆధిక్యతను సంపాదించటానికి ప్రయత్నిస్తున్నారని తెల్సుకోవాలి. వారి తార్కిక శక్తి ఇతరుల తప్పులను ఎత్తి చూపుతుంది. ఇతరులను సరిదిద్దటమే తమ ధ్యేయమనుకొంటారు. తత్ఫలితంగా వివాదాల సుడిగుండంలో పడి కొట్టుమిట్టాడుతారు. అందరూ కలసి తమను వివాదాల సుడి గుండంలోనికి తోశారని విలపిస్తారు. ఇతరులను నిందిస్తూ తమ ప్రవర్తనను సమర్థించుకొంటారు. పర్యవసానంగా ఇతరులతో వున్న సత్సం బంధాలు చెడిపోతాయి. చివరకు ఏకాకి అయిపోతారు. అందరూ కలసి తమను ఏకాకిని చేశారని అనుకొని ద్వేషంతో వ్యవహరిస్తారు. తరచు ఉద్రేక ఉద్వేగాలకు లోనయి ప్రతి అంశాన్ని వస్తుగత దృక్కోణం నుండి పరిశీలించి తమ విజ్ఞానాన్ని ప్రదర్శించే వారు ఈ కోవకు చెందుతారు.

కొంతమంది విజ్ఞానాన్ని ఆస్తిగా పరిగణించి అత్యాసతో దానిని నిలువ చేసుకొంటారు. ఆస్థిపరులు తమ ఐశ్వర్యాన్ని ప్రదర్శించి ఇతరుల మెప్పును పొందాలనుకొన్నట్లుగా వీరు కూడ తమ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శిస్తూ కన్పిస్తారు. తామాశించిన విధంగా ఇతరులు స్పందించకపోతే వారిపట్ల ద్వేషభావం కలిగి వుంటారు. అట్టివారి విజ్ఞానం వారి అహంకారా నికి ఆజ్యంపోస్తుంది. అందువల్ల విజ్ఞానం ద్వారా గౌరవ మర్యాదలను బజారులో కొనుక్కొనే వస్తువులాగ భావిస్తారు. వారు ఎంత విజ్ఞానం కలిగివుంటే అంత గౌరవం లభిస్తుందనుకొం టారు. ఇతరులకు ఏవగింపు కలిగే విధంగా తమ విజ్ఞానాన్ని ప్రదర్శించి తమ లక్ష్యాన్ని సాధించుకోవడానికి ప్రయత్నిస్తారు. వారి ప్రవర్తన ఆశించిన ఫలితాలను ఇవ్వదు, సరికదా అనేక కష్టనష్టాలను తెచ్చిపెడ్తుంది. అందరూ దూరమయిపోతారు. చివరకు సొంత ఖర్చుల మీద జనాన్ని ప్రోగుచేసి తమ విజ్ఞానాన్ని ప్రదర్శించవలసిన పరిస్థితులు ఏర్పడ్తాయి. తమ విజ్ఞానమే తమకు శత్రువయిందని నిరాశా, నిస్పృహలతో వ్యవహరిస్తూ వుంటారు. విజ్ఞానం ఎవరికి శత్రువు కాదు. సమాజ కళ్యాణానికి విజ్ఞానం అవసరం. విజ్ఞానాన్ని ఆకలింపు చేసుకొని ఇముడ్చుకోగలిగిన వారు తామానందిస్తూ ఇతరులకు కూడా ఆనందాన్ని పంచిపెట్టగలరు. విజ్ఞానాన్ని దుర్వినియోగం చేసుకొనే వారు తాము నష్టపోతూ ఇతరులకు నష్టాన్ని కలుగజే స్తారు. అందువల్ల విజ్ఞానాన్ని సద్వినియోగం చేసుకొని విజ్ఞతతో వ్యవహరించవలసిన బాధ్యత ప్రతి ఒక్కరి పైన వుంది.

ఈ సందర్భంగా సుమారు 2500ల సంవత్సరాల నాడు గ్రీసు దేశపు ప్రఖ్యాత తత్వశాస్త్ర వేత్త చెప్పిన మాటలు మనకు మార్గదర్శకంగా వుండగలవు. ఆనాటి గ్రీకు సమాజం సోక్రటీసుకు అన్నీ తెలుసునని అనుకొనే వారు. కాని సోక్రటీసు మాత్రం ''నాకు తెలిసింది ఒక్కటే; అది నాకు ఏమి తెలియదని''. సోక్రటీసు విజ్ఞతతో చెప్పిన ఈ మాటలు మనం ఇప్పటికీ మననం చేసుకొంటున్నాం. అతని కంటె విజ్ఞానం కలవారు ఎంతో మంది వున్నప్పటికీ ఆయన విజ్ఞతతో వ్యవహరించటం మూలంగా చిరస్మరణీయుడుగా వుండి పోయాడు. భర్తృహరి కూడ ఇటువంటి నీతి బోధనలే చేసాడు. ప్రతి మత ప్రవక్త ఈ విషయాలను వివరించారు. అన్ని మతాలు ఇట్టి నీతి బోధనలనే చేస్తున్నాయి. అందువల్ల విజ్ఞానాన్ని సేవకునిలా వుపయోగించుకొనే నైపుణ్యాన్ని అలవర్చుకోవాలి. విజ్ఞానాన్ని హద్దులు దాటి మనపై అధికారాన్ని చెలాయించనీయకూడదు. ఇట్టి కృషికి విజ్ఞత తోడ్పడ్తుంది. ★

# రసవివేచన

- చీమకుర్తి శేషగిరిరావు

## ఉపోద్ఘాతము

సంస్కృత భాషయందలి సాహిత్య విమర్శలో ఒక విశిష్ట స్థానమును సంపాదించినది 'రస'భావన. ఈ భావనను సాంగముగ చర్చించి, దానిని ఒక సిద్ధాంతముగ తీర్చిదిద్దినది భరతముని రచించినదిగ చెప్పబడు నాట్యశాస్త్రము. ఇది 6,000 శ్లోకముల పెద్ద గ్రంథము. పేరునకు తగినటులనే, ఆ శాస్త్రమున ముఖ్యముగ చర్చితమైనది నాట్యము. నాట్యమనగా 'దశరూప'మని అందే చెప్పబడినది. ఈ 'దశరూప'మున చేరినదే మనమిపుడు 'నాటకము' అని వ్యవహరించునది. ఈ నాటకపుతరగతి చెందినవానికే 'దృశ్యకావ్యము'లు అని పండితుల వ్యవహారము. ఇవి రంగస్థలములందు ప్రదర్శితాలై చూచువారిని రంజింపచేయునవి. ఇట్టి 'నాట్యశాస్త్ర' చర్చలో పదునొకండు విషయాలు చర్చితాలు; వానిలో ప్రముఖము అని చెప్పదగినది 'రస' భావన. రంగమునందు నటకులు తమ మాటల చేతను, అభియనము మొదలగువాని చేతను వ్యక్తముచేయు భావములను, ప్రేక్షకులు తమవిగ చేసికొని పొందెడి సంతోషము, విచారము మొదలగు మానసికానుభూతులే 'రసములు' అని స్థూలముగ చెప్పవచ్చును. వీనిని శృంగారము మొదలగు ఎనిమిది రసములుగ నాట్యశాస్త్రము వింగడించెను.

ఇటుల రసభావన తొలుత నాటకములవంటి దృశ్యకావ్యములకే వర్తింజేయబడినను కాలక్రమమున పండితులు దానిని 'శ్రవ్యకావ్యము'ల కనువర్తింపజేసిరి. శ్రవ్యకావ్యములనగా చదివిమాత్రమే ఆనందింపదగిన రచనలు, అంతేకాదు; రససంఖ్యను క్రమముగ పదింటికి పెంచుటయు జరిగినది. ఇటుల భరతుని తరువాత 'రస'భావన కాలక్రమేణ కొన్ని మార్పులకు లోనైనది.

అయితే, 'రస'భావన నాట్యశాస్త్ర రచనకు పూర్వమున లేదా? ఆకస్మికముగ తనంతట తానుగ భరతముని దానిని సృష్టించెనా? అను ప్రశ్నలు ఈ విషయమున ఏర్పడుటకు అవకాశము కలదు. ఈ ప్రశ్నలకు భరతుడే సమాధానమును చెప్పెను. బ్రహ్మ, శంకరుడు దానిని రూపొందించిరనియు, వారినుండి భరతుడు గ్రహించి, తన నూర్గురు పుత్రుల సాయమున నాట్యమును లోకమున ప్రవర్తిల్లజేసెననియు ఆ నాట్యశాస్త్రమున చెప్పబడినది. ఇది ఒక పుక్కిటి పురాణముగ స్పష్టమే; అయినను ఏదియో చారిత్రక పరంపరను అనుసరించియే తొలుత నాట్యము పరిణతి పొందినదని, అందువలన మనకు తెలియవచ్చుచున్నది. కావున రసవివేచనకై మనము ఈ క్రింది విషయాలను ముందుగ చర్చింపవలసి యున్నది. అవి:

1. పూర్వచరిత్ర - నాట్యశాస్త్ర రచనకు పూర్వమున నాట్యము చారిత్రక రీతిలో పరిణమించిన తీరుతెన్నులు.
2. నాట్యశాస్త్ర రచన - నాట్యశాస్త్రము ఏకాలమున, ఎందులకై, ఎవరికొరకు, ఏ తీరుగ రచితమైనది.
3. అనంతర పరిణతి - నాట్యశాస్త్రము రచింపబడిన తరువాత రసభావనలో కాలక్రమేణ మార్పులు ఎటుల, ఎందులకై జరిగినవి.

## పూర్వచరిత్ర

రస భావన సంస్కృత సాహిత్యముతో ముడివడినది. సంస్కృత భాషా సాహిత్యములకు మూలమైనది వేదము. కావున 'రస భావన'కు గల పూర్వచరిత్రయు వేదములతో ఆరంభమగును.

వేదములు మత గ్రంథాలుగా పరిగణింపబడుట యథార్థమే. అయినను వానిలోని ప్రార్థనల వెనుక, మనకు కనబడునది ఒక ప్రాచీన మానవ సమాజము. ఇంద్రుడు మొదలుగ వివిధ ప్రకృతి దేవతలను ఆనాటి మానవుడు తన ఇహలోకపు శ్రేయమునకే ఆరాధించెను. వానలు కురియుటకు, పంటలు పండుటకు, సంతానము వృద్ధి పొందుటకు, భయము లేకుండ నూరేండ్లు జీవించుటకు ఆనాటి మానవుడు ఆ దేవతలను ఆరాధించి, స్తుతించెననుట వేదములందలి మంత్రముల వలన చక్కగ తెలియవచ్చుచున్నది. అతడు ఎటుల జీవించ దలచెనో ఆ మంత్రముల వలననే విశదమగుచున్నది. ''నవ్వుచు నర్తించుచు దీర్ఘకాలము జీవితములను కొనసాగింతుము'' (ఋగ్వేదము X - 18 - 2) ''గానము చేయుచు, నృత్యము చేయుచు మానవులు జీవింపగలుగునది ఈ పృథివి'' (అథర్వ - XII - 1 - 41) అనుచు ఆ వేదములందలి మంత్రములు, వేదకాలపు మానవుడు ఆకాంక్షించిన సుఖజీవనమును చిత్రించుచున్నవి. ఆ నృత్యమునకు, గానమునకు, నవ్వులకు వెనుక 'రస' భావన ఆనాడు కలదా? ఇందులకు సూటిగా సమాధానము మనకు లభించుట లేదు. కాని 'రస' శబ్దము వేదములందు పలు తావులలో కనబడుచున్నది. వేదమునకై ఒక నిఘంటువును రూపొందించిన యాస్కుడు (క్రీ.పూ. 7వ శ.) 'రస' అను పదమును మూడు విధముల వర్గములలో చేర్చెను. అందువలన 'రస' అను పదమునకు ఒక విధపు ద్రవము, పుష్టిని కలిగించునది, మనసును రంజింపజేయునది అను మూడర్థములు వైదిక యుగమున ఉండినటుల సుస్పష్టము.

ఇంద్రుడు సోమరసమును త్రావి మత్తుడై దస్యుపురములను నశింపజేయుననునట్టి మంత్రముల వలన రసము మానసికానుభూతితో ముడిపడినదనుటయు ఆనాటివారు గుర్తించిరని భావించవచ్చును. ఉపనిషత్కాలమునకు ఈ 'రస' భావన కొంత విస్తృతి పొందినది. రసమును ఆస్వాదించునది నాలుక. ఆ నాలుక నుండియే మాటలును వెలువడును కావున 'రసము' మాటలందును కలదనుట బృహదారణ్యకోపనిషత్తు గుర్తించినది. అంతే కాదు, కడకు పర్యవసించునది అంగిరసము అనియు, దానికి అంగములుగ కొన్ని వేరు విధముల రసములుండుననియు అందేకలదు (బృహ - 1 - 3 - 20) రసానుభూతిని గురించిన ప్రశంస తైత్తిరీయోపనిషత్తునను కలదు

ఇటుల 'రసము' విస్తృతార్థమును ఆర్జించినపుడు, దానిని నృత్యముతో ముడిపెట్టుట ఆనాడు జరిగినట్లు కన్పడదు. కారణము సువేద్యము. ఆనాటి నృత్యము కేవలము అంగవిక్షేపము అనగా ఒక క్రమరీతిని అనుసరించి వివిధాంగములను వివిధ గతులలో కదలించుట మాత్రమే. ఇట్టి నృత్యమునకై ఒక రీతి వేషధారణయు ఆనాడు వ్యాప్తిలో ఉండినటుల కొన్ని ఋక్కులు విశదము చేయుచున్నవి. (ఋ. VI. 29.3). దీనినే 'నృత్తము' అను ప్రత్యేకపు పేరుతో భరతుడు వ్యవహరించెను. ఇందులో ఎట్టి అర్థబోధయు ఉండదు. ఇట్టి నృత్తమునకు వెనుక ఒక గాయక బృందమును ఉండియుండును. ఈ రెండు విధముల వారికి వేర్వేరు పేరులు ఉండినటుల పాణిని రచితమగు అష్టాధ్యాయి వలనను, పతంజలి వ్రాసిన మహాభాష్యమువలనను తెలియనగుచున్నది. నృత్తము చేయువారిని శోభనికులనియు, గానము చేయువారిని గాథికులు అనియు వ్యవహరించిరి. ఆర్యజాతి యందు ఇట్టి విభజన తొలుత ఉండెననుట గ్రీకు సాహిత్య చరిత్రవలనను కూడ సుస్పష్టము. తొలి గ్రీకులు నృత్తము చేయువారిని హిపోక్రయిటులనియు, గానము చేయువారిని, కోరస్ అనియు వ్యవహరించిరి.

నృత్తమును, గానమును తొలుత వేర్వేరుగ ఉండెననియు నృత్తమునకు, అర్థవంతమగు అభినయమును చేర్చి, గానముతో కలుపగ నాట్యము లేదా నాటకము కలిగెననియు భరతుడు వ్రాసెను. చారిత్రక రీతిలో చూచినపుడు ఈ సమ్మేళనము ఉపనిషత్కాలమునకు తరువాత అనగా క్రీ.పూ. 6వ శతాబ్ది ప్రాంతమున జరిగినది. ఇటుల నృత్త, అభినయ, గానముల సమ్మేళనము జరిగి నాట్యము రూపొందుటకు ఆనాటి పరిస్థితులు చాల సహకరించినవి. గానమునకు చెందిన స్వర సంఖ్యలో అప్పటికి వచ్చినమార్పు, ఈ సమ్మేళనమునకు దోహదము చేసినది. తొలుత వైదిక యుగమున సంగీతమున మూడు స్వరములే ఉండినవి. అవి ఉదాత్త, అనుదాత్త, స్వరితములు. ఆ యుగమున వీణ, వాణ, గర్గర, గోధా అను తంత్రీ వాద్యములును ఉండెడివి. కాని వేద స్వరములను తంత్రీ వాద్యములందు పల్కించుటలో శ్రుతిరంజకత తగినంతగ లేకపోవుటవలన, వివిధ శ్రుతులను దాదాపుగ లోగొనుటకై స్వరసంఖ్యను కాలక్రమేణ అయిదింటికి పెంచుట జరిగినది. భారతదేశముననేకాదు, తక్కిన ప్రాచీన దేశములందు అన్నింటను - బెబిలోనియా, ఈజిప్టు, గ్రీసు, చీనాలలో - స్వరసంఖ్య అయిదుగ చాలకాలము లెక్కింపబడినది. ఇది ఏ దేశమున మొదలై ఎటుల తక్కిన దేశములకు వ్యాపించినదియు ప్రస్తుతమున తెలియవచ్చుట లేదు. అయిదు స్వరములు సైతము సులభరీతిలో శ్రుతులను అన్నింటిని సమగ్రముగ వ్యక్తీకరింపజేయలేక పోవుటవలన ఆ స్వరసంఖ్య ఏడింటికి పెంచబడింది. ఈ మార్పు తొలుతగ భారతదేశముననే జరిగి, అటనుండి క్రమముగ గ్రీసు మొదలగు దేశములకు వ్యాపించెనని చరిత్ర రచయితల అభిప్రాయము. సంగీతమునందలి ఏడు స్వరములను తొలుతగ పేర్కొనునది తాండ్యబ్రాహ్మణము. ఈ గ్రంథము రమారమి క్రీ.పూ. అరవ శతాబ్దికి చెందినది. సంగీతమున స్వరసంఖ్య ఇటుల పెంపొందిన తరువాత తంత్రీవాద్యములందు వివిధ శ్రుతులను మనోరంజక రీతిలో పలికించుట సుసాధ్యమైనది; పాటలలో వ్యక్తమగు వివిధ మానసికానుభూతులకు - సంతోషము, దుఃఖము, భయము మొదలగువానికి - అనుగుణముగ రాగకల్పనయు సాధ్యమైనది. అభినయముతో కలసిన నృత్యమునకు, గానమును జోడించుటవలన నాట్యము

రూపొందుటకు అవకాశము లభించినది. అంతట భారత సాంస్కృతిక చరిత్రలో ఒక నూతనాధ్యాయము మొదలైనది. కాని ఆ సాంస్కృతిక పరివర్తనను ముందునకు కొనిపోవు భారమును తనపై వైచుకొనినది ప్రాకృతవాఙ్మయము; సంస్కృతము కాదు. ఈ విషయమును సంస్కృత సాహిత్య చరిత్ర రచయితలు గుర్తించలేకున్నారు.

సంస్కృత సాహిత్య చరిత్రకారులు ఉపనిషత్ యుగమునకు తరువాత లౌకిక వాఙ్మయ యుగమును గురించి చర్చింతురు. అందు రామాయణ, మహాభారతములను గురించి చర్చించిన తరువాత ఒక్కసారిగా క్రీ.శ. మొదటి శతాబ్దికి దిగివచ్చి అశ్వఘోషుడు మొదలగు వారి గ్రంథాలను చర్చింతురు. అనగా ఏడు శతాబ్దముల మధ్య కాలమున భారతీయ సాహితీ క్షేత్రమున రామాయణ మహాభారతములు మాత్రమే రూపొందెనని వారి భావన. అనగా ఆ దీర్ఘకాలమున సాహిత్య సృష్టిలో భారతభూమి గొడ్డువారినటుల వారు చిత్రింతురు. ఇది చారిత్రక సత్యమునకు విరుద్ధము.

యథార్థమున, ఆ కాలము భారతదేశ చరిత్రలో ఒక మహోజ్వల యుగముగ పరిగణింపదగినది. ఆసేతు హిమాచలమును ఒక చక్రవర్తి క్షేత్రముగ తీర్చిదిద్దు కృషి ఆ యుగమున సందులతో మొదలై, ఆ యుగముననే చాలవరకు సఫలతను పొందినది. ఆ యుగమున ప్రాకృత భాష, వివిధ ప్రాంతీయ విభేదములతో, ముందునకు వచ్చి, ప్రజల, ప్రభువుల మన్ననను, పోషణను, ఆర్జించినది. ప్రాకృత భాషయు వైదిక భాషనుండి సంస్కృతము వలెనే రూపొందినది. సంస్కృతము పండితుల భాషగ మిగిలిపోగా, ప్రాకృతము ప్రజల భాషగా పురోగమించి వికసిల్లినది. బౌద్ధ, జైనాది మతములు దానిని ఆదరించి ప్రోత్సహించినవి. ఆ మతముల ప్రామాణిక గ్రంథములే కాదు, తక్కిన శాస్త్రముల సారస్వతము - లలితకళలకు, వైద్యమునకు, తదితర శాస్త్ర శాఖలకు చెందిన సారస్వతము - ఆ భాషలో ఎంతయో రూపొందినది. ఆనాటి నగరముల శిథిలములు, స్తూపముల అవశేషములు, శిల్పఫలకాలలో చిత్రితాలైన లోక వ్యవహార రీతులు, జాతక కథలు ఆ యుగమున ప్రాకృత భాష వివిధ కళలందు సాధించిన పురోగతిని వేనోళుల చాటుచున్నవి. ఆ సారస్వతమున మతమునకు సంబంధించినది తప్ప తక్కినదంతయు దాదాపుగ నశించినది. ఇందులకు గల కారణములను సైతము మనకు చరిత్రయే తెలుపుచున్నది.

క్రీ.పూ. 187న మౌర్య చక్రవర్తియగు బృహద్రథుని వధించి పుష్యమిత్రుడు ఆధిపత్యమును వహించి వైదికమతమునకు ఆదరమును కల్పించెను. అది మొదలుగ వైదిక ధర్మముతో పాటు సంస్కృతమును ముందునకు రామొదలిడెను. ప్రాకృత సాహిత్యపు స్థానమును ఆర్జించుటకై సంస్కృతము కృషిచేసి ప్రజలను ఆకర్షించుటకై బౌద్ధ సాహిత్యమునకు మిన్నగా మహాకావ్యములను - రామాయణ భారతాదులను రూపొందించినది. శాస్త్ర గ్రంథములను వెలయించినది. అవి అన్నియు ప్రాకృత గ్రంథముల వరవడిని అనుసరించి రూపొందినవే.

ప్రాకృతభాషల స్థానమును స్వీయము చేసికొనుటకు వైదికమతపు వారలు చేసిన కృషికి ఒక బౌద్ధ సంప్రదాయపువారును - మహాయానమునకు చెందిన వారు - ఒక తీరుగ సహకరించిరి. బుద్ధదేవుడు పరమేశ్వరుని అస్తిత్వ విషయమును గురించిగాని, గహనములగు

తాత్త్విక విషయములను గురించిగాని చర్చించినవాడు కాడు. కాని క్రీ.పూ. ఒకటవ శతాబ్ది ప్రాంతమున బౌద్ధమతమున కొందరు పండితులు ఈ విషయముల గురించి ఆసక్తి చూపిరి. వీరే మహాయాన సంప్రదాయపువారు. వీరు ఇట్టి గహన విషయముల చర్చకు ఒక ప్రామాణిక భాషగ సంస్కృతమును ఆదరించి, తొలుతటి బౌద్ధులు ఆదరించిన ప్రాకృత వాఙ్మయమునకు దూరమైరి. ఇటుల ఈ రెండు రీతులలో సంస్కృతము ముందునకు రాగలిగినది. కాని కాలక్రమేణ మహాయానము భారతదేశమున తన ప్రతిపత్తిని కోల్పోవగా, ఆ సంప్రదాయము సంస్కృతమున సృష్టించిన బౌద్ధ వాఙ్మయమును అంతరించినది.

ప్రాకృత భాష, వైదిక భాషనుండి రూపొందినదే. అయినను, అందు పదముల రూపవికృతి ఎక్కువ; అంతేకాదు ఆర్యేతర భాషల పదములును అందు ఎక్కువగ చేరినవి. అందువలన పారిభాషిక పదములలో, ఆర్యేతర భాషల పదములును కలవు. ప్రాకృత భాషల వాఙ్మయమును స్వీయము చేసికొనుటలో అట్టి ఆర్యేతర పదములను కొన్నిటిని సంస్కృతము యథాతథ ముగ గ్రహించినది.

ప్రాకృత భాషల లౌకిక వాఙ్మయము అంతయు దాదాపుగ నశించినను, మత వాఙ్మయమున అనగా బౌద్ధమతపు ప్రామాణిక గ్రంథము లందు అచ్చటచ్చట ప్రస్తావ వశమున వచ్చిన కొన్ని పదముల వలన నాట్యశాస్త్రము ఆ యుగమున పొందిన వికసనము తెలియగలదు. అట్టి పదములు: నాటకము, పకరణము, అంగిరసము, అంగరసము, నటుడు, రంగస్థలము, రంగమండలము, రంగకారుడు, అభినయము, సింగారము మొదలగునవి. 'మిళిందపన్హ' అనుగ్రంథమున వీణ, వీణ యందలి వివిధాంగములు పేర్కొనబడినవి. ఈ పదములలో కొన్ని వినయపిటకముననను కలవు. ఈ వినయ పిటకము బుద్ధుని మరణానంతరమున ఏబది యేండ్లకు జరిగిన బౌద్ధుల ప్రథమ సంగీతిలో రూపొందినది.

ప్రాకృత భాషల నుండి చేరిన పారిభాషిక పదములలో, నాట్య శాస్త్ర విషయమున తొలుతగ పేర్కొనదగినది 'కుశీలవ' అనుపదము. సంచార గాయకుడు అని దీని అర్థము. ఈ పదము రామాయణపు బాలకాండలో ఉన్నది. రామాయణము ఈ కుశీలవుల వలన ప్రచారము పొందెను. 'కుశీలవ' పదమునకు సంస్కృతమున వ్యుత్పత్తి కుదురదు. అందువలన కొన్ని సంస్కృత నిఘంటువులు దానిని వదలివేసినవి; కొన్ని ఆ పదమును ప్రస్తావించియు, వ్యుత్పత్తిని ఈయక ప్రశ్నార్థముతో ముగించినవి.

ఇటుల ప్రాకృత భాషలలోని శాస్త్ర గ్రంథములను అనుకరించుచు, ఆ భాషలలోని పారిభాషిక పదములను కొన్నింటిని యథాతథముగ గ్రహించి, కొన్నింటికి రూప వికృతిని కల్పించి సంస్కృత పండితులు క్రీ.పూ. రెండవ శతాబ్ది మొదలుగ అంతటంతట ఎన్నో శాస్త్రములను రచించిరి. ప్రాకృత భాషలకు తాము ఋణపడియుండుటను పేర్కొనుట వారికి అనమానముగ ఉండెను. కావున ఆయా శాస్త్రముల అవతరణను ఎల్లెడల బ్రహ్మతో ముడిపెట్టి, బ్రహ్మనుండి తమకు లభించినటుల వ్రాసిరి. బ్రహ్మజ్ఞాన స్వరూపుడు కనుక తమకు ఇందువలన అసత్య దోషము తప్పిపోవునని వారు తలచియుందురు. ఇట్టి పంథాను అనుసరించుట వలన రూపొందినదియే నాట్యశాస్త్రము కూడ. ★ (అసంపూర్ణం)

# లింగ భేదాలు

**- అర్ధనారీశ్వరుడు**

స్త్రీ పురుష లింగ భేదం ఏ దశలో ఏర్పడుతుందనే విషయాన్ని అనేక పరిశోధనల ద్వారా తెలుసుకొన్నారు. పురుష బీజం స్త్రీ గర్భంలోని అండాన్ని చేరుకొన్న క్షణంలోనే స్త్రీ పురుష లింగ భేదం ఏర్పడుతుందని నిర్ధారించబడింది. కాని భౌతికంగా బాహ్యచిహ్నాలు కనుపించటానికి కొంత కాలం పడ్తుంది. గర్భం దాల్చిన ఆరు వారాలకు పురుష లింగ చిహ్నం కనుపిస్తుంది. స్త్రీ మర్మావయవాలు రూపురేఖలు దిద్దుకోవడానికి మూడు నెలలు పడ్తుంది. మెదడు లింగ భేదానికి అవసరమయిన హార్మోనులను ఉత్పత్తి చేయడానికి కార్య ప్రణాళికను తయారుచేసి అమలుపరుస్తుంది. గర్భస్థ శిశువు తన భావి జీవితానికి అవసరమైన శక్తియుక్తులను పుట్టుక పూర్వమే సంతరించు కొంటుంది. అందువల్లే పుట్టిన క్షణం నుండి ఆడపిల్లల, మగ పిల్లల ప్రవర్తనలో చాలా వ్యత్యాసం కన్పిస్తుంది. జన్యుకణాల ద్వారాను, హార్మోనుల ద్వారాను గర్భస్థ శిశువు తనకవసరమయిన శక్తియుక్తులను సంపాదించు కొంటుంది.

ఆడ పిల్లలకు తల్లులవవలసిన అవసరం వుంది. కాబట్టి పుట్టినప్పటి నుండి మాటలను విని మనుష్యులను గుర్తించగలుగుతారు. శబ్దాలకు త్వరగా స్పందిస్తారు. మాట్లాడటానికి ఎక్కువ ప్రయత్నిస్తూ వివిధ శబ్దాలను చేస్తారు. నవ్వుతూ అందర్ని ఆకర్షించటానికి ప్రయత్నిస్తారు. మగ పిల్లలు మనుష్యుల పోలికను బట్టి వ్యక్తులను గుర్తిస్తారు. ఇంపయిన రంగులను చూచినప్పుడు ఆనందిస్తారు. బొమ్మలంటే ఇష్టపడ్తారు. మగ పిల్లలకు మనుష్యుల కంటే బొమ్మలంటేనే ఇష్టం. ఏడుస్తున్నప్పుడు బొమ్మలు ఇస్తే వూరుకొంటారు. ఆడ పిల్లలు ఏడుస్తున్నప్పుడు ఓదార్చితే వూరుకొంటారు. ఆడపిల్లలు ఎదుటివారి భావాలను తేలికగా అర్థం చేసుకోగలుగుతారు. వారికి సామాజిక స్ఫురణ ఎక్కువ.

పరిణామ క్రమంలో ప్రకృతి, స్త్రీ పురుషులకు వేరు వేరు విధులను నిర్ణయించింది. మగవారు వేటాడి ఆహారాన్ని సంపాదించాలి. కాబట్టి జంతువులకు, తమకు మధ్య వుండే దూరాన్ని అంచనా కట్టగల స్థోమత కలిగి వుంటారు. గురిచూచి బాణాన్ని వేయగల సామర్థ్యం వారికి వుంటుంది. అట్లాగే కుటుంబ పోషణ బాధ్యత వున్న స్త్రీలకు సమాజ స్ఫురణ, మాటల చాకచక్యం పుట్టుకతోనే వస్తాయి. మగ పిల్లలు ఆటలు, వ్యాయామ క్రీడలలోను యంత్రాలను వుపయోగించటంలోను, ప్రావీణ్యత కలిగి వుంటారు. ఆడపిల్లలు ఇతర్లను గౌరవించటంలోను, ఇతర్లకు తమకు మధ్య వున్న అంతరాన్ని గుర్తించటంలోనూ చాకచక్యం చూపిస్తారు. మగ పిల్లలు, ఆడపిల్లలు ఎంపిక చేసుకొనే బొమ్మల లోను, ఆట వస్తువులలోను కూడ వ్యత్యాసం కన్పిస్తుంది.

మెదడు పనిచేసే తీరులో మగ పిల్లలకు, ఆడపిల్లలకు కొంత తేడా కన్పిస్తుంది. ఆడపిల్లలు మొదటి సంవత్సరాంతానికి స్పష్టంగా మాటలు చెప్పగల్గుతారు. ఐదారు సంవత్సరాల

మగపిల్లలు అదే వయస్సు వున్న ఆడపిల్లల కంటే తక్కువ మాటలు చెప్పుతారు. ఆ దశలో ఆడపిల్లల విషయ పరిజ్ఞానం మొగ పిల్లలకంటె ఒక సంవత్సరం ఎక్కువ వున్నట్లు వుంటుంది. ఈ వ్యత్యాసం క్రమ క్రమంగా వృద్ధి చెంది 9 లేక 10 సంవత్సరాలు వచ్చేటప్పటికి 1న్నర సంవత్సరాలుగా కన్పిస్తుంది. 14 లేక 15 సంవత్సరాల ఆడపిల్లలు అదే వయస్సు వున్న మగపిల్లల కంటే 2 సంవత్సరాలు పెద్దవారిలా ప్రవర్తిస్తారు. సుమారు 20 సంవత్సరాలు వయస్సు వచ్చేటప్పటికి మగపిల్లలకు, ఆడపిల్లలకు మధ్య తేడా అంతగా కన్పించదు. అప్పటికి ఇరువురు సమానంగా వ్యవహరిస్తారు.

ఒక మగ పిల్లవాడు, ఆడపిల్ల కవలలుగా పుట్టారు. కూర్చోటంలోను, ప్రాకటంలోను నడవటంలోను ఆడపిల్ల మొగపిల్లవానికంటె మూడు నెలలు ముందు వుందట. ఐదేళ్ళు వచ్చేటప్పటికి ఆడపిల్ల అన్ని విషయాలలోను అక్కలాగ వ్యవహరించేదట. ఒకే కుటుంబంలో పుట్టిన అన్నా చెల్లెళ్ళ విషయంలో కూడ ఇట్టి తేడాలు స్పష్టంగా కన్పిస్తాయి. సామాన్యంగా ఆడపిల్లలు శైశవ దశలో మగపిల్లల కంటే దృఢకాయులుగా వుంటారు. మొదటి సంవత్స రంలో తక్కువ జబ్బులు వస్తాయి.

తండ్రి బీజంలోని 'X' క్రోమోజం తల్లి అండంలోని 'X' క్రోమోజంతో కలసి స్త్రీ శిశువు జననానికి కారణభూతమౌతుంది. ఈ రెండు 'X' క్రోమోజాలు ఒకదానికి ఒకటి వత్తాసుగా వుండి ఆడపిల్లల ఆరోగ్యాన్ని కాపాడతాయి. ఒక క్రోమోజంలో ఏదయినా లోపం వుంటే రెండో క్రోమోజం ఆ లోపాన్ని సరిదిద్ది ఆడపిల్లల పురోభివృద్ధికి తోడ్పడుతుంది. స్త్రీలు ఇంకొక జీవిని ఉత్పత్తి చేయాలి. కాబట్టి ప్రకృతి వారికి ఎక్కువ శక్తిని ప్రసాదించింది. అందువల్లే స్త్రీలకు సగటు ఆయుః ప్రమాణం పురుషుల కంటే సుమారు 6 లేక 7 సంవత్సరాలు ఎక్కువ వుంటుంది. ఈ వ్యత్యాసం అన్ని దేశాలలోను, అన్ని జాతులలోను స్పష్టంగా కన్పిస్తుంది.

తల్లి అండంలోని 'X' క్రోమోజంతో తండ్రి బీజంలోని 'Y' క్రోమోజం కలిసినప్పుడు మగపిల్లవాడు పుడ్తాడు. 'Y' క్రోమోజం 'X' క్రోమోజం కంటే చిన్నదిగా వుంటుంది. ఈ రెండు క్రోమోజాలు కలిసి పనిచేయడంలో కొన్ని ఇబ్బందులు ఎదురౌతాయి. అందువల్లే ఎక్కువ మంది మగశిశువులు పుట్టకముందే చనిపోతారు. పుట్టిన తరువాత కూడ మొదటి వారంలో చనిపోయే శిశువులలో మగపిల్లల సంఖ్య ఎక్కువగా వుంటుంది. మగ పిల్లలు ఎక్కువగా ఏడుస్తూ తల్లిని అంటి పెట్టుకొని వుంటారు. అప్పుడే పుట్టిన ఆడపిల్ల మెదడు పనిచేసే తీరు ఒక నెల వయస్సు వున్న మొగపిల్లవాని మెదడుతో సమానంగా పనిచేస్తుంది. మూడేళ్ళు వచ్చేటప్పటికి ఆడపిల్లలు చేతులతో చేసే పనులలో మగపిల్లల కంటే ఎక్కువ నైపుణ్యం కలిగి వుంటారు. ముఖ్యంగా చేతి వేళ్ళపై మంచి ఆధిక్యత కలిగి వుంటారు. ఆడపిల్లలు, మగపిల్లల కంటే ముందు పుస్తకాలు చదవడం మొదలు పెడ్తారు. ఆడపిల్లలు శ్రద్ధగా వింటారు. తమకు తెలిసిన విషయాలను ఇతరులకు వివరంగా చెప్పగల్గుతారు. ప్రైమరి విద్యాస్థాయిలో ఆడపిల్లలు లెక్కలలో ముందుంటారు. కాని హైస్కూలు స్థాయిలో మగపిల్లలు ముందుకు పోతారు.

మగపిల్లలకు చొరవ ఎక్కువ వుంటుంది. ఆడపిల్లలకు భద్రతా వాంఛ ఎక్కువగా వుంటుంది. అందువల్లే మగపిల్లలు అనేక ప్రమాదాలకు లోనవుతూ వుంటారు. ప్రమాదాల

వల్ల చనిపోయే పిల్లలలో 70 శాతం మగపిల్లలే. ఉదాహరణకు రద్దీగా వుండే రోడ్డును దాటేటప్పుడు ఆడపిల్లలు నిర్ణీత స్థలంలో ట్రాఫిక్ లైట్లను చూస్తూ జాగ్రత్తగా దాటుతారు. కాని మగపిల్లలు ఎక్కడ పడ్తే అక్కడ దాటుతారు. బస్సులలో ప్రయాణం చేసేటప్పుడు కూడ మగపిల్లలు భద్రతా నిబంధనలను అతిక్రమించి ప్రవర్తిస్తారు.

మగ పిల్లలకు, ఆడపిల్లలకు మధ్య కన్పించే తేడా మెదడు పనిచేసే తీరువల్లననే విషయం అనేక పరిశోధనలలో తేలింది. శరీరంలోని ఇతర అంతర్భాగాలలో ఎక్కువ శాతం స్త్రీ పురుషులలో ఒకే విధంగా వుంటాయి. అందువల్లే గుండె మార్పులలోను, కాలేయం మార్పులలోను, కండ్ల మార్పులలోను లింగభేదం పాటించరు. కొన్ని శస్త్ర చికిత్సల ద్వారా పురుషులను స్త్రీలుగాను, స్త్రీలను పురుషులుగా మార్చటానికి వీలవుతున్నది. శరీరం మెదడు అజమాయిషిలో వ్యవహరిస్తుంది. కాబట్టి, లింగ భేదానికి మెదడు మూలకారణం. మెదడు శరీరంలోని రసాయన గ్రంథులను ప్రేరేపించి ఏ లింగానికి అవసరమయిన రసాయనాలను ఆ లింగానికి తగిన నిష్పత్తిలో సరఫరా చేస్తుంది.

స్త్రీల కంటే పురుషులకు హృద్రోగాల ప్రమాదం ఎక్కువగా వుంటుంది. ముఖ్యంగా బహిష్టు ద్వారా బహిర్గతమయ్యే రక్తం శరీరంలోని కొలెస్ట్రాలును నియంత్రణ చేస్తుంది. అందువల్ల బహిష్టులు ఆగిపోయిన పిదప స్త్రీలకు హృద్రోగాల ప్రమాదం అధికమౌతుంది. శరీరములోని హానికరమయిన రసాయనాలను బయటికి నెట్టి వేయటానికి కన్నీటిని వాహికగా ప్రకృతి ఏర్పాటుచేసింది. తరచు ఏడ్చే వారికి శరీరంలోని రసాయన సమతుల్యం పరిరక్షింపబడి హృద్రోగ ప్రమాదం తగ్గుతుంది. అందువల్లే పురుషులు గనుక ఆడవారి లాగ ఏడ్వగలిగితే హృద్రోగ ప్రమాదం తగ్గుతుందని అనేక వైద్య నిపుణులు చెప్పుతున్నారు. పురుషులు ఏడ్వకూడదనే విషయాన్ని చిన్నతనంలో నేర్చుకోవడం మూలంగా ప్రకృతి ఏర్పాటుచేసిన సహజ రక్షణ వసరును చాలామంది సద్వినియోగం చేసుకోలేకపోతున్నారు. ఉద్యోగం చేసే స్త్రీలు కూడ, పురుషుల లాగ ప్రవర్తించటం నేర్చుకొంటున్నారు. అందువల్లే ఉద్యోగం చేసే స్త్రీలలో పురుషులలాగానే హృద్రోగ ప్రమాదం ఎక్కువగా వున్నదని అనేక సర్వేలలో తేలింది. మన ఆరోగ్యానికి, ఆలోచనలకు అవినాభావ సంబంధం వుంది. అందువల్ల అనారోగ్యానికి మన ఆలోచనలే ముఖ్య కారణం. తరుచు అనారోగ్యానికి గురయ్యే వారు ఎక్కువ అపసవ్య ఆలోచనలతో సతమతమౌతుంటారని తేలింది.

మగపిల్లలలో టెస్టోస్టిరోన్ (Testosterone) హార్మోను ఎక్కువగా వుంటుంది. మగపిల్లల్లా ప్రవర్తించే ఆడపిల్లలలో కూడ ఈ హార్మోన్ ఎక్కువగా వుంటుందని అనేక పరిశోధనలలో తేలింది. ముఖ్యంగా మగపిల్లలు కోరుకొనే తుపాకులు, ట్రక్కులు లాంటి ఆట వస్తువులను కావాలనే ఆడపిల్లలలోను, మగపిల్లలతో ఆడుతూ మగపిల్లలలాగ చెట్లు ఎక్కుతూ గెంటే వారిలోను ఈ హార్మోను మిగిలిన ఆడపిల్లలతో పోల్చితే ఎక్కువగా వుంటుందని అనేక సందర్భాలలో కనుగొన్నారు. దురుసుగా ప్రవర్తించే ఆడపిల్లలలో, మగపిల్లలలో వుండే స్థాయిలో టెస్టోస్టిరోన్ హార్మోను వుందని తేలింది.

మాటలు వింటున్నప్పుడు మగపిల్లలు ఎక్కువగా కుడిచెవిని ఉపయోగిస్తారు. కాని ఆడపిల్లలు రెండు చెవులను సమానంగా వాడుకొంటారు. అట్లాగే ఎడమ చెయ్యిని కీలకపనులకు ఉపయోగించే వారిలో ఆడవారికంటే మగవారు ఎక్కువ ఉన్నారనే విషయం అనేక

సర్వేలలో తేలింది. చిక్కయిన మార్గాలలో మ్యాపుల సహాయంతో గమ్యాన్ని చేరుకొనే పోటీలలో మగపిల్లలు తమ శక్తిసామర్థ్యాలను బాగా ప్రదర్శిస్తారు.

ఆడపిల్లలు తమ మెదడులోని కుడి ఎడమ అర్ధభాగాలను సమిష్టిగా సమస్యా పరిష్కార క్రియలో వుపయోగిస్తారు. ఆడపిల్లలో ఈ రెండు భాగాలను కలిపే నాడీ వ్యవస్థ, మగపిల్లల మెదడులోని వ్యవస్థ కంటే దృఢంగా వుంటుంది. అందువల్లే సంక్లిష్టమయిన సమస్యలను పరిష్కరించే సందర్భాలలో ఆడపిల్లలు, సంబంధించిన అంశాలను వివిధ దృక్కోణాల నుండి పరిశీలించి బాధ్యతాయుత నిర్ణయాలను తీసుకొంటారు. అట్టి సందర్భాలలో ఎక్కువమంది మగపిల్లలు దురుసుగా వ్యవహరిస్తారు. ఏ విషయాన్నయినా స్థూలంగా పరిశీలించటంలో స్త్రీలు ముందుంటారు. కాని సూక్ష్మంగా పరిశీలించే ప్రక్రియలలో మగవారు తమ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తారు. ఒక గదిలో అనేక వస్తువులను వుంచి మగపిల్లలను, ఆడపిల్లలను వాటిని ఒక నిముషంపాటు చూచి ఇంకొక గదిలోకి వెళ్ళి వాటి పేర్లను వ్రాయమన్నారు. ఆడపిల్లలు సగటున 15 వస్తువులను వ్రాయగా, మగపిల్లలు సగటున 12 వస్తువుల పేర్లను మాత్రమే వ్రాయ గలిగారు. బొమ్మ ముక్కలను, బొమ్మలాగా అమర్చి తయారుచేసే పనిలో మగపిల్లలు తమ చాకచక్యాన్ని ప్రదర్శించగలిగారు. పుస్తకాలను గబగబ చదవటంలో ఆడపిల్లలు ముందుంటే, క్లిష్టమయిన లెక్కలు చేయడంలో మగపిల్లలు ముందుంటారు.

కొంతమంది వ్యక్తుల ఫోటోలను చూపించి వారి ముఖంలో వ్యక్తపరిచే భావావేశాన్ని వివరించమన్నప్పుడు స్త్రీలు పురుషుల కంటే బాగా చెప్పగల్గారు. అట్లాగే కొన్ని ఆడియో టేపులను వినిపించినప్పుడు ఆ మాటల వెనకనున్న భావాలను స్త్రీలు పురుషులకంటే వివరంగా చెప్పగలిగారు. మాటలు రాకముందు పిల్లల భావాలను గ్రహించటంలో తల్లులు తండ్రుల కంటే అధిక నేర్పును కలిగి వుంటారు. ముఖ్యంగా పిల్లలను పెంచి పెద్దవారిని చేయాల్సిన బాధ్యత వున్న స్త్రీలకు ఇట్టి సహజ ప్రవృత్తి జన్మతః వస్తుంది.

వ్యక్తుల సామర్థ్యం వారి శరీరంలో ఉత్పన్నమయ్యే రసాయనాల ప్రభావంపై ఆధారపడి వుంటుందనే సత్యాన్ని అనేక పరిశోధనలలో కనుగొన్నారు. ముఖ్యంగా టెస్ట్రోస్టోన్ రసాయన పరిమాణం వ్యక్తుల సామర్థ్యానికి సూచిక. పురుషులలో ఈ రసాయనం రోజు కొన్ని గంటలపాటు ఉచ్చస్థితికి చేరుకొని మళ్ళీ తగ్గుతుంది. సామాన్యంగా వుదయం నాలుగు గంటల ప్రాంతంలో ఉచ్చస్థితిలో వుండి రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో అతి తక్కువ స్థాయికి వస్తుంది. స్త్రీలలో ఈ రసాయనం బహిష్టుకి, బహిష్టుకి మధ్య కాలంలో ఉచ్చస్థితికి చేరుకొని, బహిష్టు అయినప్పుడు తక్కువ స్థాయిలో వుంటుంది. పురుషుల సామర్థ్యం రోజులో వివిధ వేళలలో భిన్నస్థాయిలలో వుండగా స్త్రీలలో కొన్ని రోజులకొకసారి మారుతూ వుంటుంది.

సహజ సిద్ధంగా వున్న లింగభేదాలు పెంపకం ప్రభావంవల్ల మరింత భిన్నంగా రూపురేఖలు దిద్దుకొంటాయి. ఈ వ్యత్యాసాలను గుర్తించి వ్యవహరిస్తే వ్యక్తుల మధ్య సంఘర్షణలను చాలావరకు నివారించవచ్చు. సమాజంలో సుఖసంతోషాలతో జీవించటానికి ఇట్టి విషయపరిజ్ఞానం ప్రతి ఒక్కరికి అవసరం. ★



# సత్యము - సాపేక్షకమా?

రవీంద్రనాథ్
ఆలపాటి

నా అంతరాత్మ చెబుతున్నది. కనుక 1922లో దేశానికి స్వతంత్రం వస్తుందని గాంధీజీ బహిరంగంగా చాటారు. గడువు దాటిపోయింది. అంతరాత్మ చెప్పింది నిజం కాలేదు. హిమాలయాలంత తప్పు చేశానని గాంధీజీ ప్రకటించారు.

కెకూల్ అనే సైంటిస్ట్ తన సమస్యను ఆలోచిస్తూ పడుకుంటే మగత నిద్రలో కల వచ్చి ఒక పాము తల మరో పాము తలలో ఇరుక్కుపోయినట్లు చుట్ట చుట్టక పోయిన ఆకారంలో చూచాడు. అది రసాయన శాస్త్రంలో కొన్నాళ్ళుగా పరిష్కారం కాకుండా వున్న సమస్యకు ఉపయోగపడింది. తనకు ఎలా స్వప్నం వచ్చిందో అదెలా తోడ్పడిందో చెప్పాడు. సమస్యకు పరిష్కారం హఠాత్తుగా జరగలేదు. సతమతమౌతూ వుండగా అలాంటి పరిణామం జరిగింది. తన కలను పరీక్షకు పెట్టాడు. ఫలితం వచ్చింది. రుజువైంది. ప్రపంచానికి చాటాడు. అది ఎవరైనా పరీక్షించవచ్చు. అలాంటి సత్యం అందరి ఆస్తిగా మారింది.

కొన్ని శతాబ్దాలుగా సత్యం గురించి అన్వేషణ, చర్చ సాగుతూనే వుంది. అన్ని కాలాలకూ, ప్రదేశాలకూ అన్వయించే సత్యం వుందా? మార్పుకు గురికాని సత్యం నిలకడగా కనిపిస్తుందా? ఎవరు ఎక్కడ ఎప్పుడు చూచినా మారని సత్యం వుందా?

ఇంచు మించు మతాలన్నీ పరమ సత్యాల్ని ప్రవచించాయి. హిందువులకు వేదాలు, క్రైస్తవులకు బైబిల్, ముస్లింలకు ఖురాన్ తిరుగులేని పరమ ప్రమాణ పవిత్ర గ్రంథాలు. అందులో చెప్పినవన్నీ దైవదత్తాలు గనుక వాటిని ప్రశ్నించడానికి వీల్లేదు. ఇలాంటి భావాల్ని కేవల సత్యం, పరమసత్యం అంటారు. ఇవి మారవు. పరీక్షకు పెట్టడానికి, రుజువు అడగడానికి వీల్లేని ప్రవచనంగా వీటిని స్వీకరిస్తారు. నమ్మకం వీటి పునాది. వీటిని అనుసరిస్తే మోక్షం లభిస్తుందని బోధించారు. పరిష్కరించడానికి ప్రయత్నించిన వారు కూడా మూల గ్రంథాల జోలికి పోలేదు. ఉదాహరణకు ఆర్యసమాజం వారు హిందూ ఆచారాలు, వ్యవహారాలు చక్కదిద్దడానికి తలపెట్టారు. కాని వేదాలలో దోషం వున్నదని వారు అనలేదు. వేదాలవైపు నడుద్దామన్నారు. క్రైస్తవులు బైబిల్‌ను వ్యాఖ్యానించడంలో కొట్లాడుకున్నారే గాని, పోప్ పెత్తనాన్ని కొందరు కాదన్నారేగాని, బైబిల్‌ను వద్దనలేదు.

ముస్లింలలో ఎన్ని చీలికలు, శాఖలు వున్నా, ఖురాన్ పవిత్ర ప్రమాణాన్ని నిరాకరించలేదు. పరమ సత్యం అలా మతపరంగా, ఆధ్యాత్మిక చింతనగా వచ్చింది. మార్మిక వాదులు, ఋషులు, తమ ఆలోచనల్ని అనుభూతుల్ని పరీక్షకు గురిచేయరు. అందువలన వారు చెప్పేది దోషపూరితమా కాదా అనేది వారికి తెలిసే అవకాశం లేదు. దైవ ప్రేరణతో తాము సాగిపోతున్నామని నమ్మేవారికి రుజువులతో పనిలేదు. వారిని అనుసరించేవారు కూడా మంచి చెడులు చూచే అవకాశం లేదు.

తత్వంలో కూడా పరమ సత్యాల్ని గురించి చర్చ జరిగింది. అయితే అక్కడ కూడా నమ్మకమే మూలాధారంగా మిగులుతున్నది. కొంతదూరం తర్కాన్ని ఆధారం చేసుకున్నా, ఎక్కడో ఒకచోట ఆగిపోయి, అదే పరమ సత్యం అని చెబుతున్నారు. ప్లేటో, కాంట్, హెగెల్, బ్రాడ్లీ వంటి తత్వవేత్తలు యీ కోవకు చెందిన వారే. విశ్వ వ్యాప్తంగా భావాలు వున్నాయని, అవి పరమసత్యాలని, వాటి నుండి మనం నిత్యం చూచే వాటిని రాబడతామని ప్లేటో నమ్మాడు. ఇది రుజువు చేయమంటే కుదరదు. నిలబడదు. అలాగే కాంట్ వస్తుగత తత్వం కూడా.

సైన్స్‌లో కూడా అనేక సందర్భాలలో ఒడిదుడుకులు వచ్చాయి. ఎప్పటికప్పుడు సైన్స్ తన 'నమ్మకాల్ని' పరీక్షకు పెడుతుంది. కనుక ముందుకు సాగిపోతుంది. నేను చెప్పిందే సరైనది అని సైన్స్ అనదు. రుజువు ముఖ్యం. ఒకసారి రుజువు అయిన తరువాత, అది సరైనది కాదనే వరకూ నిలబడుతుంది. కొత్తగా కొన్ని విషయాలు తెలిసిన తరువాత, పాత వాటిని మార్చుకోడానికీ, అవసరమైతే చరిత్రకే పరిమితం చేసి, కొత్త వాటిని స్వీకరించడానికీ సైన్స్ వెనుకాడదు. వ్యక్తి గొప్పవాడు గనుక అతను చెప్పింది ప్రశ్నించకుండా ఆమోదించడం అనేది సైన్స్‌లో లేదు.

సైన్స్ పరిధిలో న్యూటన్, కెప్లర్, గలీలియో మొదలైన వారికి నమ్మకాలుండేవి. కాని వారు కనుగొన్న విషయాలు మత ప్రమాణ గ్రంథాలకు భిన్నంగా వున్నాయి. కనుక ఎప్పటికప్పుడు సైన్స్‌లో కనుగొన్న వాటిని మతం వ్యతిరేకించింది. సైంటిస్టులను తిట్టడం, కొట్టడం, చంపడం చరిత్రలో మతపరంగా చూచాం. మత పరమసత్యాలు తప్పు అని సైన్స్ రుజువు చేస్తున్నా, మూర్ఖంగా అనుసరించడం నమ్మకస్తుల హక్కు.

మానసిక పరిధిలోనూ అనేక నమ్మకాలున్నాయి. సత్యం తిరుగులేనిది అని నమ్మితే, కొత్తగా కనుగొనేది ఏదీ వుండదు. సహనం పోతుంది. అధికారం, పెత్తనం పనిచేస్తాయి. సైన్స్‌లో సహనం ఉంటుంది. సహకారం ముఖ్యంగా పనిచేస్తుంది. రుజువుకు గౌరవం లభిస్తుంది.

సాపేక్షతా సిద్ధాంతం చెప్పిన ఐన్‌స్టీన్ కూడా నమ్మకాలతో వుండేవాడు. దేవుడు చదరంగం ఆడుకోడనీ, విశ్వంలో నియమబద్ధతకు అనుకూలంగా, నాలుగు శక్తుల మధ్య ఐక్యత లభించే అవకాశం వుందనీ నమ్మాడు. కాని ఆయన నమ్మకం రుజువు కాలేదు. తాను చెప్పిందే సరైనది అని ఐన్‌స్టీన్ పట్టుబట్టలేదు. వేచివుండొచ్చేమో గాని, ప్రస్తుతం క్వాంటం సిద్ధాంతంలో రుజువుకు నిలబడి పనిచేస్తున్న వాటిని కాదనలేదు. అది సైంటిస్టుల ప్రజాస్వామిక సహన ధోరణి అని చెప్పుకోవచ్చు.

టైం మాగజైన్ ఒకసారి యూరి గెల్లర్‌ను తన కార్యాలయానికి ఆహ్వానించి, అతడు ప్రదర్శించే శక్తులపై వ్యాసం వేసి, అతడి ముఖచిత్రం వేయాలనుకున్నది. కాని జేమ్స్ రాండి అవన్నీ రుజువుకు నిలబడవని సవాల్ చేశాడు.

## విలువలు :

మత విలువలు వున్నాయి. సత్యం, శివం, సుందరం, మోక్షం, ధర్మం, అర్థం, కామం యిలాంటివి ఎన్నో ఆధ్యాత్మికపరంగా ప్రవచించారు. మతం లేకుంటే విలువలు వుండవనీ, సమాజం విచ్ఛిన్నమౌతుందనీ చెప్పారు. మానవుల్ని వర్గీకరించి, హెచ్చుతగ్గులు

సృష్టించారు. అందులోనే కులాలు అంటరానితనం మతపరంగా వచ్చాయి. జాతులు, రంగు భేదాలు చోటుచేసుకున్నాయి. దైవం ముందు అందరూ సమానమే అని చెప్పినా, యీ లోకంలో అందరినీ సమానంగా పరిగణించలేదు. కనుక విలువలన్నీ దైవపరంగా వ్యాఖ్యానించారు. మానవుడి పుట్టుకే పాపం అన్నారు. దీనికి కారణం కర్మ అన్నారు. పూర్వజన్మను అనే ఖాతాను ప్రవేశపెట్టారు. ఈ విషవలయం నుండి బయటపడడానికి మార్గాలు చెప్పారు. యజ్ఞ యాగాదులు క్రతువులు, ఆచారాలు, విశ్వాసాలు వచ్చి పడ్డాయి. భయపెట్టారు. మరణానంతరం ఏదో వుందనే నమ్మకస్తులంతా యీ భయాలకు లొంగిపోయి, అనేకం ఆచరిస్తున్నారు. ఇవేవీ రుజువులకు నిలబడవని విస్మరించరాదు.

మానవుడి గౌరవం-దైవం మతంతో నిమిత్తం లేకుండా-సమాన హక్కులు వుండాలనేది 20వ శతాబ్దంలో సైన్స్ వలన వచ్చింది. 1948లో మానవ హక్కుల్ని అనేక శాస్త్రీయ చర్చల అనంతరం రూపొందించారు. దైవపరంగా వున్న హక్కుల్ని తొలిసారి మానవపరం చేశారు. అయినా ఆచరణలో అవన్నీ అమలు జరగడం లేదు. నమ్మకాల నుండి బయటపడకపోవడమే యిందుకు కారణం. అత్యధిక దేశాలు మానవ హక్కుల్ని సూత్రప్రాయంగా అంగీకరించాయి. కాని ఆయా దేశాలలో మతం వాటిని అమలు పెట్టనివ్వడం లేదు. పరమ సత్యానికీ సాపేక్షిక సత్యానికీ సంఘర్షణ అనేది విలువలలో, నీతిలో వున్నది. పట్టుసడలితే తమ వృత్తి పోతుందని మతపరమైన వారు భావిస్తున్నారు. కొత్త దేవుళ్ళను సృష్టిస్తున్నారు. కొత్త నమ్మకాలు అన్వేషిస్తున్నారు. స్వశక్తిపై ఆధారపడి ఆలోచించే వారు తక్కువగా వున్నంత కాలం, ఏదో ఒక నమ్మకం వూతంగా వుండాలనే వారున్నంతకాలం పరమ సత్యవాదులు చలామణి అవుతారు. విలువల్ని ఎలా రాబట్టామనేది సమస్య. మతపరంగా రాబడితే, వాటికి పరమ సత్యం అనే ప్రమాణం వస్తున్నది. దైవదత్తంగా వచ్చిన విలువల్ని ప్రశ్నించడానికి, మార్చడానికీ, రుజువుకు పెట్టడానికీ వీల్లేదన్న మాట.

సైన్స్‌పరంగా విలువలు వస్తే అవి మానవ ప్రమాణంగా వుంటాయి. చర్చ జరుగుతుంది. స్వేచ్ఛగా ఆలోచించడం, మానవుడికి గౌరవం, సమానత్వం యివ్వడం ముఖ్యం. అవసరమైతే మార్చుకుంటాం. చర్చ జరుపుతాం. దేనినీ తిరుగులేని ప్రమాణంగా, రుజువు అక్కర్లేని సత్యంగా భావించం. స్వేచ్ఛకు అత్యంత గౌరవం యిస్తాం. మా మతం అంగీకరిస్తేనే గౌరవిస్తాం, లేకుంటే నాస్తికులు, మ్లేచ్ఛులు, కాఫిర్లు, పేగన్లు అంటాం అనే ధోరణి శాస్త్రీయ విధానంలో వుండదు. మానవుడు దైవం కోసం బ్రతకాలని గాక, మనిషి తన కోసమే వుంటాడు. అలా వుండాలంటే తోటి వారు కూడా వున్నారని గ్రహించాలి. ఎవరు ఎటుపోతేనేమి, నాకు మోక్షం సిద్ధిస్తే చాలు అనే నమ్మకంతో సమాజంలో ముందుకు పోలేడు. పరస్పర సహకారం అనేది మానవ ప్రగతికి అత్యవసరం. శాస్త్రీయ పంథాలో యిది సాధ్యం.

సైంటిస్టు ఏది కనిపెట్టినా అది ప్రపంచ వ్యాప్తంగా అందరికీ తెలుస్తుంది. అందరి సొత్తు అవుతుంది. అందరూ అనుభవించవచ్చు. మంత్ర రహస్యం ఏదీ అందులో వుండదు. కొత్త మార్పులు అవసరమైతే అందుకు సైన్స్ సిద్ధమే. ఇది ప్రజాస్వామిక రీతి. మానవుడి పురోగతి, సంక్షేమం అనేవి తెలుసుకోడంలో యిమిడి వున్నాయి.

## ఉద్రేకం

ఉద్రేకం మానవుడి లక్షణం. సైన్స్‌లో దీనికి స్థానం వుందా? వున్నది: అయితే ఉద్రేకం

రాగానే ఆచరణకు పూనుకొనక, దీనికి వివేచన జోడించడం సైన్స్‌లో ప్రధానం. అప్పుడు ఉద్రేకాన్ని సక్రమంగా దారి మళ్ళించవచ్చు. లేకుంటే కట్టలు తెంచుకొని ఎటుపోతుందో తెలియని అయోమయంలో పడొచ్చు. నా మతమే సరైనది అని, ఎదుటి వారిది తప్పు అని ఉద్రేకంగా రెచ్చగొడితే, మానవ మారణకాండకు దారి తీయొచ్చు. ఇది చరిత్రలో రుజువైన వాస్తవం. ఉద్రేకం వచ్చిన తరువాత ఆలోచించి, పదును పెడితే సాపేక్షతా, క్వాంటం, జెనెటిక్స్ సిద్ధాంతాలువస్తాయి. అవి మానవ సంక్షేమానికి తోడ్పడ్డాయి.

ఆదిశేషువుపై భూమి వుందని చదివిన విదేశీ విద్యార్థులు ఒక సైన్స్ క్లాసులో అమాయకంగా అడిగారట: **''అయితే, ఆదిశేషువు దేనిపై వుందో?''**

సమాధానం లేదు. కార్యకారణ వాదం ప్రకారం చర్చిస్తూ పోతుంటే దేవుడి దగ్గర ఆగిపోతారు. అక్కడ ప్రశ్నించ కూడదంటారు. అన్నింటికీ దేవుడే కారణం, స్వయంభువు అంటారు. ఇక ప్రశ్నిస్తే కోపం తెచ్చుకుంటారు. ప్రశ్న ఆగిన చోట ప్రగతి వుండదు. నీవు ఆలోచించవద్దు అనేది మతం. ఆలోచన ఆగిపోతే మానవుడు ఏ పురోగమనమూ సాధించలేడు. ఇక్కడే విలువలు బేరీజు వేసుకోవాలి.

సాపేక్షతా సిద్ధాంతం ఆలోచిస్తున్న రోజుల్లో ఐన్‌స్టీన్ ఎంతో ఉద్రేకానికి లోనయ్యాడు. సమస్యలతో సతమతమయ్యాడు. ఒక పట్టాన తేలక జుట్టు పీక్కొని, ఆ ఉద్వేగంతో ఒకసారి తన కాలేజి మిత్రుడు మార్సెల్ గ్రాస్‌మన్‌తో అన్నాడు: ''నీవే నాకు యీ సమయంలో తోడ్పడాలి; లేకుండే పిచ్చి ఎక్కేట్లుంది'' అని. గ్రాస్‌మన్ ఆలోచించి, యూక్లిడ్ గణితం వదలి, రేమాన్ గణితంతో చూచావంటే నీ సమస్యలు ఒక దారికొస్తాయి అన్నాడు. అలాగే జరిగింది. కనుక ఉద్వేగానికి వివేచన జోడించడం సైన్స్‌లో ప్రధానాంశం, ఉద్వేగంతో రెచ్చగొట్టి ఆలోచన చంపడం యోగదృష్టి.

ఐన్‌స్టీన్ నమ్మకం గురించి ప్రస్తావించాం గదా. ఏమిటా నమ్మకం? విశ్వంలో 4 శక్తులున్నాయని కనుగొన్నారు. గురుత్వాకర్షణ, విద్యుదయస్కాంతం, న్యూక్లియర్ బలీయశక్తి, న్యూక్లియర్ బలహీన శక్తి. ఈ నాలుగింటిలో మొదటి రెండూ కార్యకారణ విధానాన్ని చూపుతుండగా, మిగిలిన రెండూ కార్యకారణ పద్ధతికి భిన్నంగా వున్నాయి. అయితే క్వాంటం (తేజఃకణ సిద్ధాంతం) విధానంలో ప్రయోగాలు ఎన్నో చేసి చూశారు. స్థితి, గతి రెండూ కనుగొనడం ఒకేసారి సాధ్యకాదని తేలింది. స్థితి తెలిస్తే గతిని, గతి తెలిస్తే స్థితిని తెలుసుకోవచ్చని నియతివాదం లోగడ చెప్పింది. అది క్వాంటంలో విఫలమైంది. అయితే క్వాంటంను నిత్య జీవితంలో వాడుతున్నాం. ఫలితాలు చూస్తున్నాం. ఉజ్జాయింపుగా, గణితంతో తప్ప, కచ్చితంగా కార్యకారణ విధానం చెప్పడానికి వీల్లేదన్న మాట. నాలుగు శక్తులు ఏకీకరణ విధానంలో వుండొచ్చునేమో అనే ఆశావాదాన్ని ఐన్‌స్టీన్ వెల్లడించాడు. కుదరక వూరుకున్నాడు.

చలనం అనేది సాపేక్షతతో వుంటుందే గాని, ఒకే తీరులో వుండదని ఐన్‌స్టీన్ సిద్ధాంత రీత్యా వెల్లడిస్తే, అది సరైనదేనని రుజువైంది. పరమ సత్యం అనేది పోయిందన్నమాట. ఐన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతం కాదనడానికి ఆధారాలు చూపితేనే పరమ సత్యాల వూసెత్తడానికి వీలుంటుంది.

సైన్స్ ఏది రుజువు చేసినాసరే నా నమ్మకం నాది అనే వారున్నారు. వారిని ప్రపంచ వ్యాప్తంగా వాడుకునే వ్యక్తులూ వున్నారు. మతం వుండనే వుంది. ★

# గణితాన్ని తత్త్వశాస్త్రంతో మేళవించిన స్పినోజా, లెబ్నిజ్

- డా॥ ఎన్. ఇన్నయ్య

న్యూటన్ వచ్చి సైన్స్‌లో చాలా మలుపు తిప్పాడు. హార్వే వచ్చి రక్తప్రసరణ వివరించాడు. హూగిన్స్ రాకతో కాంతి ప్రసారం తరంగాల వలె వుంటుందనీ తేలింది. ఒకవైపున సైన్స్ యిలా విప్లవ పరంపరలు తెచ్చి పెట్టగా కొత్త ప్రయోగాలకు ప్రోత్సాహం లభించింది. బేకన్ శాస్త్రీయ రీతి, డేకార్ట్ నూతన పద్ధతులు యూరోప్‌లో హేతుతత్వానికి తోడ్పడ్డాయి. అయితే డేకార్ట్ ద్వంద్వవాదం మళ్ళీ కొందర్ని గందరగోళంలో పడేసింది. సత్యాన్వేషణలో వచ్చిన యీ అయోమయ స్థితిని ఎదుర్కోవలసి వచ్చింది. అలాంటప్పుడు యూదుల్ని తరిమికొడుతున్న సంఘటనలు కూడా వున్నాయి. ఆ స్థితిలో స్పినోజా వచ్చాడు. హేతుబద్ధంగా ఆలోచించిన స్పినోజా ద్వంద్వవాదాన్ని తృణీకరించాడు. మత అసహనానికి గురైన స్పినోజా ఎదురీది నిలిచాడు.

## స్పినోజా తత్వం (1632 - 77)

అతనితో యూదులెవరూ మాట్లాడగూడదు. దగ్గరకు వెళ్లకూడదు. అతను రాసింది చదవకూడదు. అతడ్ని వెలివేస్తున్నాం అని యూదుమత సనాతన సంఘం నిర్ణయించింది. అతడే స్పినోజా.

ఏమిటి అతడు చేసిన నేరం? బైబిల్ లో ఏ భాగం ఎవరు రాశారు, ఎప్పుడెప్పుడు రాశారు. సాక్ష్యాధారాలు ఏమిటి అని విచికత్సచేసి విడమరచి, తర్కించి రాశాడు. బైబిల్‌ను చారిత్రకంగా, శాస్త్రీయంగా చూడమన్నాడు. ఆత్మ, దేవతలు, అమరత్వం దైవ ప్రేరణలు తృణీకరించాడు. 1670లో స్పినోజా చేసిన యీ నేరానికి యూదులు అతణ్ణి పిలిచి సంజాయిషీ అడిగారు. విమర్శ మానేయమన్నారు. డబ్బిస్తామన్నారు. స్పినోజా అన్నిటికీ నిరాకరించారు. ఆంస్టర్ డాం నుండి అలా యూదుల మధ్య వెలికి గురైన స్పినోజా అన్నింటికీ సిద్ధపడి హేగ్‌లో కుదురు కున్నాడు. పెళ్ళి చేసుకోలేదు బక్కప్రాణి. స్వల్పాహారంతో గడుపుతూ కళ్ల అద్దాలు తయారుచేసి బ్రతికేడు. అద్దాలు పాలిష్ పడుతుంటే, రోజా వాటినుండి వచ్చే ధూళి వూపిరితిత్తుల లోకి పోయి, జబ్బుచేసి 44 ఏళ్ళకే చనిపోయాడు. కాని ఆయన బ్రతికుండగా ఎందరినో ప్రభావితం చేశాడు. చనిపోయిన తరువాత ఆయన భావాల బలం వుర్రూత లూగించింది. క్రైస్తవులు, యూదులు స్పినోజాను నాస్తికుడన్నారు. తీరా చనిపోయిన తరువాత వెలికి వచ్చిన రచన చూస్తే, ప్రపంచమంతా దేవుడే అని రాసివుంది! అదే సుప్రసిద్ధమైన అతడి ఎథిక్స్ పుస్తకం.

నైతిక సమస్యల్ని హేతుబద్ధంగా రేఖాగణితం వలె పరిష్కరించవచ్చని, మేధస్సుతో చర్చించవచ్చని స్పినోజా రాశాడు. పవిత్ర గ్రంథాలకు దైవ ప్రేరణ వుంటుందని ఆయన

నమ్మలేదు. ద్వేషం కంటె ప్రేమ అత్యుత్తమమన్న స్పినోజా, ప్రాయశ్చిత్తం అంగీకరించలేదు. అంతా దైవనిర్ణయమైతే, ఇక ప్రార్థనలు, మొక్కుబడులు పాప పరిహారాలు దేనికన్నాడు. అదంతా అజ్ఞానంగా పేర్కొని భయాన్ని పోగొట్టుకోమన్నాడు.

ఓల్టేర్, లెస్సింగ్, రస్సెల్ వంటి వారిపై స్పినోజా ఆకర్షణ అనన్య సామాన్యం.

## సంక్షిప్త జీవనం

యూరోప్ తాత్విక రంగాన్ని రెండున్నర శతాబ్దాలు ప్రభావితం చేసిన స్పినోజా 1632 నవంబరు 24న ఆమ్‌స్టర్‌డాంలోని స్పెయిన్ యూదు కుటుంబంలో పుట్టాడు. యూదు అకాడమీలో చదువుకున్నాడు. మత సంస్థకు దూరంగా వుంటూ, చిన్నప్పటి నుండే తన సందేహాలను వ్యక్తం చేశాడు. స్వేచ్ఛా చింతనాపరుడు, డాక్టరు అయిన వాన్ ఎండీ వద్ద లాటిన్ చదువుకున్న స్పినోజా అతడి కుమార్తె క్లారాను ప్రేమించాడు. ఆమె తన కంటె 12 ఏళ్ళు పెద్ద. కాని పెళ్ళి చేసుకోడానికి అంగీకరించలేదు.

స్పినోజా, నాటి సైన్స్ చదువుకున్నాడు. బ్రూనో, డేకార్ట్‌లను అధ్యయనం చేశాడు. మత సంస్థకు దూరమౌతుండగా, యూదులు గ్రహించి పింఛను యిస్తామన్నారు. ఛాందసుడు ఒకతను చంపుతానని బెదిరించాడు. 1656లో యూదులనుండి వెలివేశారు. కళ్ళ అద్దాలు పాలిష్ చేస్తూ బ్రతుకుదెరువు వెళ్ళబుచ్చాడు. యువకులు అతడి ఆలోచనల పట్ల ఆకర్షితులయ్యారు. యూనివర్సిటీ మేధావులు సైతం స్పినోజా ఆలోచనలు పట్టించుకున్నారు. లెడన్ దగ్గర రైన్స్ బర్గ్ అనే చిన్న నగరంలో 1661 నుండి వుంటూ తన రచనలు చేశాడు. 1663లో వూర్‌బర్గ్ వెళ్ళి 1670 నుండీ హేగ్‌లో స్థిరపడ్డాడు.

1643లో డేకార్ట్ తత్వాన్ని విమర్శిస్తూ రచన ప్రచురించిన స్పినోజా, నీతి శాస్త్ర రచనపై దృష్టి పెట్టాడు. 1670లో మత రాజకీయ సిద్ధాంత రచన చేశాడు. ఇందులో మత స్వేచ్ఛను కావాలంటూ, బైబిల్‌ను నిశితంగా పరిశీలించాడు. అద్భుతాలకు వ్యతిరేకంగా వాదించాడు. హైడెల్‌బర్గ్‌లో ప్రొఫెసర్ ఉద్యోగం యిస్తామంటే తృణీకరించాడు. నీతి శాస్త్రం ఐదు భాగాలు రాసినా, ప్రచురించలేదు. నమ్మకస్తులైన స్నేహితులకే చూపెట్టారు. ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తూ పోగా 1677 ఫిబ్రవరి 21న చనిపోయాడు. ఆ ఏడాదిలోనే స్పినోజా నీతిశాస్త్రం వెలుగుచూచింది. ఈ పుస్తకమే యూరోప్‌ను కొన్నాళ్ళపాటు మేధస్సు రంగంలో ఉర్రూత లూగించింది. యూక్లిడ్ రేఖాగణితం నమూనాగా సిద్ధాంతం, ప్రతిపాదన, రుజువులు అనే తీరులో నీతిశాస్త్ర రచన సాగింది. ప్రకృతిని దైవాన్ని వివరించడంలో స్పినోజా అనుసరించిన నిగమన పద్ధతి ఎంతో ఆకర్షించింది.

## స్పినోజా నీతిశాస్త్రం

నీతిశాస్త్రం అనే శీర్షిక కొంత గందరగోళాన్ని సృష్టిస్తుంది. స్పినోజా ప్రకృతిని గురించి యిందులో చర్చించాడు. ఆధిభౌతికం కూడా విపులంగా వుంది. ప్రకృతిని హేతుబద్ధంగా, శాస్త్రీయంగా అవగాహన చేసుకోవడం అతడి దృష్ట్యా ముఖ్యం. తరువాత మానసిక రీతులు, యిచ్ఛ, రాగ ద్వేషాలు చర్చించాడు. దీనంతటికీ రేఖా గణిత పద్ధతుల్ని వినియోగించుకున్నాడు.

దేవుడ్ని గురించి చర్చ ఉపక్రమించి ఆరు నిర్వచనాలు, ఏడు ప్రతిపాదనలు చేశాడు. వీటికి రుజువులు అక్కరలేకుండా, ప్రాతిపదికల ఆధారంగా ముందుకు సాగాడు. స్వయంగా అవి నిర్ధారితాలని అతడి ఉద్దేశం. ప్రకృతి దైవం ఒకటే అని చెప్పిన స్పినోజా, ఇదంతా పదార్థంగా, అనంతంగా, స్వయంగా దాని కారణం దానిలోనే యిమిడి వున్నట్లుగా భావించాడు. ఈ పదార్థానికి పరిమితులు లేవు. ఇదంతా దైవం. అదే ప్రకృతి. ఇందులో మర్మం ఏదీ లేదు. సనాతన మతస్తులందరూ స్పినోజా వాదాన్ని జుగుప్సతో చూచారు. స్పినోజా నిగమన తర్కంలో మానవుడి వివేచన కూడా దైవ వివేచనలో భాగమే. మనస్సు వీటన్నిటినీ అవశ్యంగా భావించి, తర్కించి నిర్ధారిస్తుంది. ఈ విచికిత్స వలన మనం ప్రకృతికి, అంటే దైవానికి సన్నిహితుల మౌతాం.

మనల్ని మనం కాపాడుకోవడం మన తత్వంలో వున్నది. అందుకే ప్రకృతిని తెలుసుకుంటాం. ఇలా ప్రకృతిని (దైవాన్ని) గ్రహిస్తూ పోవడంలో కాలంతో నిమిత్తం లేదు.

బయట కారణాలు, కార్యాల ప్రభావంతో మనిషి వుండటమంటే, బానిసత్వమే. మనిషి దైవంతో తాదాత్మ్యం చెందితే, మానసిక బానిసత్వం వుండదు. ఏ మేరకు ప్రకృతితో కలుస్తామో అంతవరకు మానసిక స్వేచ్ఛను పొందినట్లే. స్వేచ్ఛ అనేది మనం నిర్ధారించుకునే అంశం. స్వేచ్ఛా జీవికి భయం వుండదు. అన్ని దోషాలకు మూలం అజ్ఞానం. ఇది తొలగడానికి జ్ఞానార్జన జరగాలి. స్వేచ్ఛాజీవి మరణాన్ని గురించి ఆలోచించడు. జీవితాన్ని గురించే మథనపడతాడు. పరిమితుడైన మనిషి అపరిమితమైన ప్రకృతితో సంబంధం పెట్టుకొని, తెలుసుకుంటూ పోతాడు. నీతిశాస్త్రంలో స్పినోజా యిలాంటి నిర్ధారణ వాదాన్ని ప్రవేశపెట్టాడు.

స్పినోజా వాదమంతా తార్కికం. అయితే శాస్త్రీయ పద్ధతికి కావలసిన పరిశీలన మాటేమిటి? అది పట్టించుకున్నట్లు అగపడదు. మనిషిని గురించి స్పినోజా సిద్ధాంతం స్వార్థ దృష్టికి దారితీసే అవకాశం వుంది. ప్రేమవలన ద్వేషం తొలగి పోతుందని అతడు నమ్మాడు. మానవుడు దైవాన్ని గ్రహించడమే అత్యుత్తమ జ్ఞానం అన్నాడు. అంటే ప్రకృతిని ఎంత గ్రహిస్తే అంత ఉన్నత స్థాయి అన్న మాట. భయం నుండి నిరంకుశత్వం నుండి మనిషి బయటపడాలని స్పినోజా పదే పదే వాదించాడు. మరణానంతరం జన్మవున్నదనేది కేవలం భ్రమ అన్నాడు. దేనిని గురించి అయినా స్పష్టమైన అవగాహన వుంటే, అతిగా ప్రేమించడం గాని, రాగద్వేషాలకు లోనుగావడం గాని వుండదు.

ప్రపంచం యావత్తూ ఒకే పదార్థం. ఏ ఒక్క భాగం దానంతట అదే వుండజాలదు. స్పినోజా తర్కం వలన శాస్త్రీయ పద్ధతిలోని అంచనా, పరిశీలనలకు తావు లేదు. పరిశీలన ద్వారా వాస్తవాలు గ్రహించడం నేటి విధానం. కాని మానవుడు తన పరిమితులు గ్రహించి, ఉన్నతంగా బ్రతకవచ్చు అనేది స్పినోజా నుండి నేర్చుకోదగిన అంశం. అలాగే చావుగురించి అతడి ఆలోచన విశిష్టమైంది. మనం ఎంత ఆలోచించినా అమరులం, శాశ్వతులం కాజాలం. కనుక చావును గురించి చింతిస్తూ, భయపడుతూ బ్రతకడం అనవసరం. అలా భయపడడం మానసిక బానిసత్వానికి దారితీస్తుంది. పగతీర్చుకునే ధోరణి స్థానే ప్రేమవుండాలని స్పినోజా చెప్పాడు.

స్పినోజా తన సమాకాలీన గణితశాస్త్రాన్ని ఆపోశన పట్టాడు. అందులో నిగమన తర్కాన్ని వినియోగించాడు. సంప్రదాయ దైవభావాల్ని తృణీకరించాడు. స్వేచ్ఛ కావాలన్నాడు. తోటి తాత్వికుడు లెబ్నిజ్‌వంటి వారితో చర్చించాడు. రాను రాను స్పినోజా ఎంతో గౌరవాన్ని పొందాడు.

స్పినోజా సెక్యులర్ భావాలు పేర్కొనదగినవి. ప్రభుత్వ, మానసిక రీతుల్ని అందులో పెట్టే ప్రయత్నం చేయకూడదనీ, మతస్వేచ్ఛ వుండాలనీ అన్నాడు. మత ప్రవక్తలు మేధస్సుతో అవగాహన చేసుకున్న దానికంటే, వూహించి చెప్పినవి ఎక్కువ అన్నాడు. స్పినోజా అనంతరం ఆయన పట్ల ఖండనలు, మెచ్చుకోళ్ళు సాగుతూనే వున్నాయి.

# లెబ్నిజ్ తత్వం (1646 - 1716)

ప్రపంచంలో గడియారాలెన్నో వున్నాయి. వేటికవే గంటలు కొడతాయి. ఒక గడియారం గంట కొట్టింది గనుక అది గమనించి మరొకటి స్పందించదు. ఇలా సమయానికి ఒకేసారి అన్ని గడియారాలు గంటలు కొట్టడం దైవం ముందే ఏర్పరచిన పొందికే. ఇది సంపూర్ణ యాంత్రిక చిదంశల (ఆత్మల) విధానం. ఒక దానికీ మరో దానికి సంబంధం లేదు. వీటికి మోనాడ్ అని లెబ్నిజ్ నామకరణం చేశాడు. ఈ ఆత్మకు కిటికీలు లేవు కనుక బయటకు ఏదో పంపడం, బయటనుండి మరేవో స్వీకరించడం అంటూ వుండదు. అంటే ప్రతి ఆత్మ దానికదే చైతన్యవంతమైంది. విశ్వమంతా యీ ఆత్మలో ప్రతిబింబిస్తుంది. అది దైవమిచ్చిన స్వభావం. ఈ ఆత్మలలో తరతమ భేదాలు వున్నాయి. మనిషిలో ఎన్నో శాశ్వత ఆత్మలు (చిదంశలు) వున్నాయి. ఇందులో ఆధిపత్యం వహించేవి, తక్కువ స్థాయిలోవి వున్నాయి.

ఇలా వుంటుంది లెబ్నిజ్ తత్వం. అతడు బ్రతికివున్నన్నాళ్ళూ యిలాంటి తత్వాన్ని ప్రవచించి, ప్రచారం చేసి, ప్రభావితం చేశాడు. ఈ ప్రభావం రెండు శతాబ్దాలు పనిచేసింది. యూనివర్సిటీ ఉద్యోగం యిస్తానంటే వద్దని రాజు ఆస్థానంలో వున్న లెబ్నిజ్, సమకాలీన శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలతో సన్నిహితంగా వున్నాడు.

లెబ్నిజ్ ద్వంద్వ జీవితం గడిపాడు. ఆయన చనిపోయిన తరువాత, తార్కికంగా శాస్త్రీయంగా రాసిన అనేక రచలు బయటపడ్డాయి. చాలామంది ఆశ్చర్యపోయారు. అధికారులకు, మతానికి భయపడి తన అసలు ఆలోచనల్ని రహస్యంగా అట్టిపెట్టాడను కున్నారు.

మొత్తం మీద లెబ్నిజ్ తత్వం బేరీజు వేసి చూస్తే ఆధిభౌతికం ఒక భాగంగానూ, తార్కిక సిద్ధాంతం మరో తీరుగానూ వుంటుంది.

పదార్థం ఆలోచించలేదనే ధోరణి చూపిన లెబ్నిజ్, కార్యకారణ సంబంధం పదార్థాల మధ్య లేదన్నాడు. అయితే కాలం ప్రదేశం అనేవి ఏమిటంటే అవి వాస్తవాలు కాదనీ, కేవలం కనిపించే తీరు అన్నాడు. ఏ రెండు ఆత్మలూ ఒకటి కాదన్నాడు. ప్రతి ఆత్మవుండడానికి తగిన కారణం కలదన్నాడు. ఎవరికివారే స్వేచ్ఛగా వుండే తీరును లెబ్నిజ్ భావించాడు.

లెబ్నిజ్ దృష్టిలో ఎన్నో రకాలైన ప్రపంచాలు వుండడానికి అవకాశం వున్నది. ఇందులో

అత్యుత్తమమైన దానినే దేవుడు సృష్టించడానికి కారణం, దైవం మంచితనంతో వుండడమే నన్నాడు. చెడుకంటె మంచికి ఆధిక్యమిచ్చేదే ఉనికిలోకి వచ్చిందన్నమాట. ప్రపంచంలో చెడువున్నా, ఎక్కువ మంచి వున్నది. కనుక ఇది అత్యుత్తమమైన ప్రపంచం అన్నాడు. తర్కానికి అత్యంత ప్రాధాన్యత యిచ్చినట్లు లెబ్నిజ్ ఉత్తరోత్తర రచనల బట్టి తెలుసుకున్నారు. ప్రతి దానికీ తగిన కారణం వుండడం, పరస్పర విరుద్ధ తర్కం అనే వాటిని లెబ్నిజ్ విపులీకరించాడు. వ్యక్తిగతంగా ఆలోచించి, తత్వానికి ఆధారంగా తర్కం వుండొచ్చనుకున్నాడు. అది బ్రతికుండగా బయట పెట్టలేకపోయాడు.

17వ శతాబ్దంలో లభించిన శాస్త్రీయ జ్ఞానం ఆధారంగా లెబ్నిజ్ చెబుతూ విశ్వమంతటా పదార్థం వున్నదనీ, ఇది చైతన్యవంతంగా వెల్లడికావడానికి ప్రయత్నిస్తుందనీ చెప్పాడు. ఆధునిక విజ్ఞానానికి యిది చేరువలో వున్నదని యాంథొని క్వింటన్ (బ్రిటిష్ గ్రంథాలయాధ్యక్షుడు) అభిప్రాయపడడం సబబే. అంటే పదార్థానికి చైతన్యం లేదా చర్య అనేది మూలంగా భావించాడన్న మాట. దేనికైనా స్పష్టత అవసరమనీ, అది వచ్చేవరకూ వివరణ, చేసుకుంటూ పోవాలని లెబ్నిజ్ అన్నాడు. పరిమిత సత్యాలు, సంపూర్ణ సత్యాలని రెండు రకాలున్నాయి. సంపూర్ణ సత్యాలు స్పష్టంగా తెలుస్తాయి. పరిమిత సత్యాలలో వైరుధ్యాలు కనిపిస్తాయి.

లెబ్నిజ్ దృష్టిలో దైవం ఒక్కటే ఉనికి కలిగి వుంటుంది. మిగిలినవన్నీ దైవం పై ఆధారపడేవే. ఇలా వుంటుంది అతడి వాదన.

గణిత సంబంధమైన తర్కాన్ని లెబ్నిజ్ పెంపొందించాడు. విషయాలను గ్రహించడానికి స్పష్టత కావాలనడంలో అతడి విశ్లేషణ గణనీయమైనది. ★

## LITERARY FOOTNOTES

**April 20, 1859**

First volume of *The Tale Of Two Cities* is published.

**April 21, 1910**

Mark Twain dies aged 79.

**April 22, 1899**

*The Awakening* by Kate Chopin is published.

**April 23, 1564**

William Shakespeare is born and dies this day in 1616.

**April 24, 1942**

Brendan Behan is sentenced by a Dublin military court to 14 years' imprisonment for shooting at police during an IRA march.

**April 25, 1826**

Lord Byron leaves England for exile in Europe.

**April 26, 1914**

Bernard Malamud is born in New York.

# భౌతికశాస్త్ర గమనం

సేకరణ: డా॥ డి. చంద్రశేఖర రెడ్డి, కాకాని చక్రపాణి

## 1. ఆధునిక భౌతికశాస్త్రం - హృదయ మార్గమేనా?

ఆధునిక భౌతికశాస్త్రం మానవ సమాజాన్ని అన్ని దిశలా ప్రభావితం చేస్తూ వుంది. అది ప్రాకృతిక శాస్త్రానికి ఆధార భూతమైంది. సాంకేతిక ప్రాకృతికశాస్త్రాలు రెండూ కల్సి మానవాళికి కళ్యాణకారకంగానూ, హానికరంగానూ కూడా వ్యవహరించాయి. ఇవాల్టి రోజున అణుభౌతికశాస్త్రాన్ని ఉపయోగించుకోని పరిశ్రమ ఏదీ లేదు. వీటి సూత్రాలు ఆధారంగా అణ్వస్త్రాలు తయారవటంతో ఇవి ప్రపంచ రాజకీయ పరిణామాన్ని కూడా నిర్దేశించాయి. అయితే, ఆధునిక భౌతిక శాస్త్ర ప్రభావం సాంకేతిక శాస్త్రానికి మాత్రమే పరిమితమయి వుండలేదు; ఆలోచన, సంస్కృతుల పరిధిలోకి కూడా చొచ్చుకుపోయింది. విశ్వంపట్ల మనకున్న భావనలో మార్పు తీసుకవచ్చింది; సంప్రదాయ భావాల పరిమితులను బహిర్గతం చేసింది; ఆధారభూతమని నమ్మిన మన సిద్ధాంతాలలో మార్పులు తీసుక రావాల్సిన అవసరం కల్గించింది. ఉదాహరణకు అణుభౌతికశాస్త్రంలో పదార్థ భావన సంప్రదాయ భౌతికశాస్త్రం లోని భావనకు - భౌతికమని భావించే భావనకు - పూర్తిగా భిన్నమైనది. స్పేస్, కాలం లేక కార్యకారణ సంబంధ భావనల్లోనూ ఈ భిన్నత్వం స్పష్టమవుతుంది. మన చుట్టూ వున్న ప్రపంచం గూర్చిన మన ఆలోచనలకు ఈ భావనలు ఆధారాలు. ఇవి మారిపోవటంతో, ప్రపంచం పట్ల మన ఆలోచనలూ మారాల్సిన అవసరం కలిగింది.

గత దశాబ్దాలలో, భౌతికశాస్త్రం తీసుకవచ్చిన ఈ మార్పుల గూర్చి ఎంతోమంది భౌతిక శాస్త్రవేత్తలూ, తత్వవేత్తలూ చర్చించారు. వారి ఆలోచనలన్నీ ఒకే మార్గంలో పయనించినా, అవి ప్రపంచం పట్ల ప్రాచ్యమార్మికతా భావనా సరళిలో వున్నట్టుగా సకృత్తుగా మాత్రమే గమనించటం జరిగింది. దూర ప్రాచ్య మత తాత్వికతలలో వ్యక్తమయిన భావాలు ఆధునిక భౌతిక శాస్త్రభావాలను పోలివుండటం ఆశ్చర్యంగొల్పే విషయం.

ఇరవయ్యో శతాబ్దపు భౌతికశాస్త్రానికి మూలస్తంభాలయిన క్వాంటం, రెలిటివిటీ సిద్ధాంతాలు హిందూ, బౌద్ధ, టావో మతామయాయుల ప్రాపంచిక దృష్టిని పోలి వున్నాయి. మహా సూక్ష్మ ప్రపంచాన్ని ఈ రెండు దృక్కోణాలూ ఒకే విధంగా విపులీకరించే ప్రయత్నం చేశాయి. ప్రాచ్య మార్మికవాదమే కాదు, మార్మిక వాదంలో ప్రభవించిన అన్ని మతతత్వాల లోను ఈ దృష్టి ఎంతో కొంతమేరకు కన్పిస్తూనే వుంటుంది. పాశ్చాత్య తత్వశాఖల్లోనూ మార్మికతా లక్షణాలు దృగ్గోచరమవుతాయి. హిందువుల వేదాల్లోనూ, 'ఇషింగ్' లేక బౌద్ధ

సూత్రాల్లోనూ మాత్రమే కాదు, హెరాక్లిటస్ సిద్ధాంతాలలోను, ఇబన్ అరబీ సూఫీ సిద్ధాంతాల లోను, యాఖీ మంత్రవేత్త హెరాక్లిటస్ సిద్ధాంతాలలోను, ఇబన్ అరబీ సూఫీ సిద్ధాంతాలలోను, యాఖీ మంత్రవేత్త డాన్ జువాన్ ప్రవచనాల్లోనూ ఇది కన్పిస్తూనే వుంటుంది. అయితే ప్రాచ్య, పాశ్చాత్య మార్మికతా వాదాల్లో ఓ భేదం వుంది. పాశ్చాత్యంలో మార్మికతావాదం ప్రభావం మహాఅల్పం; ప్రాచ్యంలో మతతాత్త్విక ఆలోచనకది జీవన స్రోతస్సు అయింది.

భౌతికవాదం ఇవాళ మనల్ని మార్మికవాద ప్రపంచం వైపు మరలిస్తే, అది, పుట్టినప్పటి కాలానికి - 2500 సంవత్సరాల క్రితానికి - మన్ని తీసుకవెళ్తుంది. పాశ్చాత్య విజ్ఞానశాస్త్ర గమనం ఆసక్తిదాయకంగా వుంటుంది. తొలి గ్రీకుల ఆలోచన మార్మిక తత్త్వాన్నుండి తలెత్తి, తార్కిక దృష్టితో వికాసం పొందుతూ, పోను పోను మార్మికతత్త్వం నుండి విడివడి పోయింది, దూర ప్రాచ్య ప్రపంచ దృష్టికి భిన్నంగా వికసించింది. ఇప్పటి భౌతికశాస్త్రం తొలిగ్రీకులు మార్మికత వైపు, ప్రాచ్యతత్త్వాల మార్మికత వైపు తిరుగుముఖం పట్టింది. ఇప్పుడిది అంతఃక రణ ప్రవృత్తి (intuition) మీరే ఆధారపడివుండలేదు, స్పష్టమైన పరిశోధనా ఫలితాలపైనా గణితశాస్త్ర నిర్ధారణ మీదా ఆధారపడివుంది.

అన్ని పాశ్చాత్యశాస్త్రాల లాగానే భౌతికశాస్త్రమూ క్రీ.పూ. ఆరవ శతాబ్దపు తొలి గ్రీకు తాత్త్విక - సాంస్కృతిక యుగంలో రూపుదిద్దుకొంది. విజ్ఞాన తత్త్వశాస్త్రాలు, మతం ఆ సంస్కృతిలో అభిన్నంగా ప్రత్యక్షమవుతాయి. మైలీషియన్ తాత్త్విక చింతకులకు అలాంటి విభేదం గోచరించలేదు. వస్తు నిజప్రకృతి గూర్చే వాళ్ళ జిజ్ఞాస. వస్తు నిజ ప్రకృతినే వాళ్ళు 'ఫిజిస్' (Physis) అన్నారు. అలా మొదలైన ఆపదం, సర్వ వస్తువుల నిజప్రకృతిని కనుగొనే ప్రయత్నంగా 'ఫిజిక్స్' (Physics) గా రూపుదిద్దుకొంది. తరవాతి కాలంలో మైలీషియన్లకు గ్రీకులు 'హైలోజోయిస్ట్స్' (Hylozoists) అని పిలచేవాళ్ళు. పదార్థాన్ని కూడా సజీవంగా భావిస్తారని వాళ్ళకాపేరువచ్చింది. చేతనాచేతనలకు, ఆత్మ-వస్తువుల మధ్య భిన్నత్వాన్ని వారు పరిగణించలేదు. నిజానికి 'వస్తువు' అన్న పదం వాళ్ళకు లేదు. అస్తిత్వం గల అన్ని రూపాల్లోను జీవాన్ని ఆత్మనూ వాళ్ళు చూశారు; అందువల్లనే థేల్స్‌కి అన్ని వస్తువుల్లోనూ దైవత్వం కన్పించింది. మానవ శరీరం గాలి పీల్చి ఎలా మనుగడ సాగిస్తుందో అలాగే విశ్వం విశ్వశ్వాస (Pneuma) తో బతికే జీవిగా ఎనాక్జిమాండర్ వర్ణించారు.

మైలీషియన్ల ఈ అద్వైత (monistic), సేంద్రియ (organic) దృష్టి ప్రాచీన భారతీయ, చైనా తాత్త్వికతలకు చాల దగ్గరగా వుంటుంది. దీనికంటే హెరాక్లిటస్ తత్త్వం ప్రాచ్య చింతనకు మరింత దగ్గరైనది. పరివర్తనా శీల ప్రపంచం పట్ల హెరాక్లిటస్ తత్త్వం ప్రాచ్య చింతనకు మరింత దగ్గరైనది. పరివర్తనాశీల ప్రపంచం పట్ల హెరాక్లిటస్‌కు నమ్మకముండేది. ఆయన దృష్టిలో స్థిరంగా కన్పించేదంతా భ్రమ పూర్వకమైనది. ఆయన విశ్వ సిద్ధాంత చిహ్నం - అగ్ని; నిరంతర గతిశీలనకు అది చిహ్నం. చక్రభ్రమణంలో విరుద్ధ స్వభావాల అన్యోన్య ప్రభావంవల్ల ప్రపంచంలో మార్పులు సంభవిస్తున్నాయని ఆయన బోధించారు. వైరుధ్యాల జంటను ఆయన ఒక ఏకత్వ సూత్రంగా భావించారు. ఈ వియాటిక్ తాత్త్విక చింతన మనుషుల నధిగమించిన దైవత్వ భావనను క్రమంగా సంతరించుకుంది; ఈ భావనలో విశ్వం ఒక ఏకతా సూత్రం; దాన్ని పైనుండి నడిపించే ప్రజ్ఞాశీలి దేవుడు. అలా మొదలైన దైవభావన

చివరకు ఆత్మను వస్తువును వేరుగా చూసే ద్వైత భావనకు దారితీసింది. ఈ ద్వైత భావన ఆ తరువాత పాశ్చాత్య చింతనా లక్షణ మయింది.

హెరాక్లిటస్ వాదానికి పూర్తిగా భిన్నమైంది పెర్మనైడ్స్ చేసిన వాదం. ఆయన దృష్టిలో 'జీవి' (Being) అద్వితీయమైంది. మార్పులేనిది. మార్పు అనేది అసంభవమనీ, ప్రపంచంలో మార్పు పొందుతున్నట్లు కన్పించేదంతా మన జ్ఞానేంద్రియాలు కల్పించే భ్రమేననీ ఆయన అభిప్రాయపడ్డాడు. మార్పు పొందే ధర్మాలలో విచ్ఛిన్నం కాని పదార్థ సిద్ధాంతం ఈయన తాత్త్విక చింతననుండే బయలుదేరి, పాశ్చాత్యుల ఆలోచనలకు మూలసూత్రమైంది.

క్రీ.పూ. 5వ శతాబ్దంలో గ్రీకు తత్త్వవేత్తలు హెరాక్లిటస్, పెర్మనైడ్స్‌ల వాదాల మధ్య గల భేదాన్ని అధిగమించ ప్రయత్నించారు. అపరిణామ శీలానికీ (పెర్మైడ్స్ సిద్ధాంతం), పరిణామ శీలానికీ (హెరాక్లిటస్ సిద్ధాంతం) రాజీ కుదిర్చే ప్రయత్నంలో మార్పు పొందని పదార్థాలలో 'జీవి' అవతరించి వుందని, ఆ పదార్థాలు కలవటం విడిపోవటంతో ప్రపంచంలో మార్పులు కలుగుతున్నాయనీ వాళ్లు చెప్పారు. ఈ రాజీ ప్రయత్నం ఇంక విభజింపరాని అతి సూక్ష్మ పదార్థవిభాగమైన అణుభావనకు దారితీసింది. లూసిపస్, డెమోక్రిటస్‌ల తత్త్వాలలో ఇది స్పష్టంగా వ్యక్తమయింది. గ్రీకు అణుశాస్త్రజ్ఞులు ఆత్మకు పదార్థానికి మధ్య స్పష్టమైన గీతను గీశారు; పదార్థాన్ని మూలక నిర్మాణ సూక్ష్మాంశాల సమాహారంగా నిర్వచించారు. ఈ సూక్ష్మాంశాలు శూన్యంలో విహరించే నిర్జీవాణువులు; ఈ అణువులు చలించటానికి వాళ్ళు కారణం వివరించలేదు కానీ, పదార్థం నుండి భిన్నమైన అధ్యాత్మిక బాహ్యశక్తుల ప్రేరణవల్లే చలనం సంభవిస్తోందని భావించారు. తరవాతి శతాబ్దాలలో పాశ్చాత్య చింతనలోని ద్వైత భావనకు - బుద్ధి - పదార్థం, శరీరం - ఆత్మల ద్వైత భావనకు ఇది మూలకందమైంది.

ఆత్మ - పదార్థం వేరన్న భావన పాదుకొన్న తరువాత, తత్త్వవేత్తల దృష్టి ఆధ్యాత్మిక ప్రపంచం వైపు మళ్ళింది; మనిషి ఆత్మ, నైతిక సమస్యల గూర్చి ఆలోచించసాగారు. ప్రాచీన శాస్త్ర విజ్ఞానాన్ని అరిస్టాటిల్ వ్యవస్థీకృతం చేశారు. మధ్య యుగాల్లో క్రిస్టియన్ చర్చి ఆయన భావాల్నే అనుసరించింది. మళ్ళీ సాంస్కృతిక పునరుజ్జీవన కాలం దాకా పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానంలో ఎలాంటి కొత్త భావాలు చోటుచేసుకోలేదు. అప్పుడు అరిస్టాటిల్ సిద్ధాంతాలతో చర్చి నమ్మకాల పట్టునుండి మనిషి బయటపడ ప్రయత్నించాడు. పదిహేనవ శతాబ్దంలో సంపూర్ణ శాస్త్రీయ దృక్పథంలో ప్రకృతిని గూర్చిన అధ్యయనం ప్రారంభమయింది. ఊహలనీ, భావాలనీ నిర్ధారించే పరిశోధనల ఆధారంగా గణితశాస్త్ర పరిభాషలో సిద్ధాంతాలు సశాస్త్రీయంగా రూపుదిద్దుకోవటం ప్రారంభమైంది. ఊహను గణితంతో మొట్టమొదటగా జోడించిన వాడు గెలీలియో. అందువల్లే ఆయన్ని ఆధునిక విజ్ఞానశాస్త్ర పితామహుడుగా పిలుస్తారు.

ఆధునిక విజ్ఞాన శాస్త్రారంభానికి ముందూ, ఆ తరువాతా కూడా తాత్త్విక చింతన సాగుతూనే వుంది. ఆత్మ - పదార్థాల ద్వైత భావన తీవ్ర తరమవుతూ వచ్చింది. పదిహేడవ శతాబ్దపు రినే డికార్టిస్ తాత్త్విక చింతనలో ఇది స్పష్టమైంది. ఈయన దృష్టిలో ప్రకృతి రెండు సామ్రాజ్యాలు - మన స్సామ్రాజ్యం (res cogitans), పదార్థ సామ్రాజ్యం (res extensa)

ఈ విభజన పదార్థాన్ని మృతంగాను, జీవుల నుండి భిన్నంగాను చూపింది. భిన్న వస్తువులు ఓ మహోయంత్రంలో సమీకరింపబడినట్లు భౌతిక ప్రపంచాన్ని శాస్త్రజ్ఞులను దృశింపచేసింది. అలాంటి ప్రపంచ యంత్ర భావన ఐజక్ న్యూటన్‌కి వుండేది. తన యాంత్రిక సిద్ధాంతాన్ని అయన దానిమీద ఆధారపడే సృజించాడు; ఆపై దాన్ని సాంప్రదాయిక భౌతికశాస్త్రానికి ప్రాతిపదిక చేశాడు. పదిహేడవ శతాబ్ది ద్వితీయార్థం నుండి పందొమ్మిదవ శతాబ్ద్యంతం వరకూ మొత్తం శాస్త్రీయ ఆలోచనా దృష్టినే న్యూటన్ విశ్వ యాంత్రిక భావన రాజ్యమేలింది. పై నుండి ఏకచ్ఛత్రాధి పత్యంతో నియతులేర్పరచి భగవంతుడు ప్రపంచాన్ని పరిపాలించటం ఓ ప్రతీకలయింది. అలా శాస్త్రజ్ఞులు శోధించే మూల భౌతిక ప్రాకృతిక నియమాలను ప్రపంచాన్ని శాసించే శాశ్వత భ.:వన్నియతులుగా భావించటం జరిగింది.

డికార్టిన్ విభజన సంప్రదాయ భౌతిక శాస్త్రాభ్యుదయానికి దోహదం చేయటమేకాక పాశ్చాత్య జీవన విధానాన్ని కూడా ప్రభావితం చేసింది. డికార్టిన్ ప్రఖ్యాత ప్రవచనం - 'నేను ఆలోచిస్తున్నాను, అందుకే నేనున్నాను' (**Cogito ergo sum**) - పాశ్చాత్యులు తమను తమ సంపూర్ణ జీవితో కాక, తమ మనస్సుతో ఒకటిగా గుర్తుంచుకునేటట్లు చేసింది. శరీర బంధనంలో ఉన్న 'అహం'గా మనుషులు తమను తాము భావించుకోసాగారు. శరీరాన్నుండి మనసును విడగొట్టి, దానికి శరీరాన్ని అదుపుచేసే వ్యర్థమైన పని అప్పగించటం జరిగింది. దాంతో సంకల్పిత ఇచ్ఛకు, అసంకల్పిత సహజాతాలకు మధ్య సంఘర్షణ కలిగింది. వ్యక్తి కార్యాచరణ, ప్రతిభ, నమ్మకాలు మొదలైన వాటికి అనుగుణంగా అతన్ని ముక్కలు ముక్కలుగా ఛేదించటం జరిగింది. కలిగిన ప్రయోజనం అయోమయం, విఫలమనోరథం.

భిన్న వస్తువుల, సంఘటనల సమాహారమైన 'బాహ్య' ప్రపంచ దృష్టిని ఈ ఆంతరిక విచ్ఛిన్నత ప్రతిఫలిస్తుంది; ప్రాకృతిక పరిసరాలు చిన్న చిన్న విభాగాలయిపోయాయి; ఏ వ్యక్తి అయినా వాటిని తన ఇష్టం వచ్చిన విధంగా ఉపయోగించుకోవచ్చు. ఈ భిన్న దృక్పథం సమాజానికి కూడా అంటగట్టటంతో ప్రపంచం దేశాలుగా, జాతులుగా, మత రాజకీయ విభాగాలుగా విడిపోయింది. మనం ప్రస్తుతం ఎదుర్కొనే సామాజిక, పర్యావరణ, సాంస్కృతిక విషమ సమస్యలకు మూల కారణం ఈ భిన్న భావనే. అందువల్లనే ప్రాకృతిక సంపదను మనం న్యాయంగా పంచుకోలేకపోయాం. ఆర్థిక రాజకీయ అస్తవ్యస్తతను కొని తెచ్చుకున్నాం; హింసా మార్గంలో, కలుషితం అయిన పరిసరాల్లో సాగే మానవ జీవితం శారీరక మానసిక అనారోగ్యం పాలబడ్డది.

అలా డికార్టిన్ విభజన, ప్రపంచ యంత్రభావన మంచినీ చెడునూ - రెంటినీ కలుగజేశాయి. సంప్రదాయ భౌతిక సాంకేతిక శాస్త్రాలు పురోగతిని సాధించాయి. కాని నాగరికతకెంతో హాని కలిగింది. డికార్టిన్ విభజనలో, ప్రపంచ యంత్ర భావనలో ప్రభవించి, అలాంటి భావాలవల్లే సాధ్యమయిన ఇరవయ్యో శతాబ్దపు విజ్ఞానశాస్త్రం ఇప్పుడీ భిన్న భావనను అధిగమించి, ప్రాచీన గ్రీకు ప్రాచ్యతత్త్వాల ఏకతా సూత్రానికి దారితీయటం ఆసక్తి కలిగించే విషయం.

పాశ్చాత్య యాంత్రిక దృక్పథానికి భిన్నంగా ప్రాచ్యుల ప్రపంచదృష్టి ఏకతా సూత్ర బద్ధమైంది. సేంద్రియమైంది. ఇంద్రియాలవల్ల లభించే జ్ఞానం అన్యోన్య సంబంధంతో

ఏకవమటమేకాక, ఇవన్నీ ఒకే సత్యానికి భిన్న దృక్కోణాలని భావించారు ప్రాచ్యులు. ప్రపంచాన్ని వ్యక్తులుగా, భిన్న వ్యక్తులుగా విభజించటాన్ని బౌద్ధ తత్వంలో 'అవిద్య' అన్నారు. వ్యాకులమయిన మనస్సు అలాంటి 'అవిద్య'ను - భ్రమను కల్పిస్తుంది.

ప్రాచ్యమార్మిక వాద శాఖలు వివరణలలో భేదించినా. అవి అన్నీ ఏకతా సూత్రాన్ని ప్రతిపాదించాయి. టావో మతానుయాయులైనా, హిందువులయినా, బౌద్ధులయినా వారందరికీ ఈ ఏకతా సూత్ర స్పృహ వుంది. వస్తువుల పరస్పర సంబంధాన్ని గూర్చిన తెలివిడి వుంది. వ్యక్తిని అధిగమించిన అనంత సత్యంతో తమని ఒకటిగా భావించుకునే భావన వుంది. దీన్నే 'జ్ఞానం' అని వాళ్ళు పిల్చారు. ఇది వట్టి బౌద్ధికం కాదు, మొత్తం వ్యక్తినీ పాలుపంచుకునే టట్టు చేసే అనుభవమిది. ప్రాచ్య దృష్టిలో ప్రకృతిని భిన్న వస్తువులుగా విభజించటం సాధ్యం కాదు, వస్తువులు మార్పు పొందుతూ వుండవచ్చు. అయితే విశ్వమంతా గతిశీలమూ, జీవద్వంతమూ, సేంద్రియమూ అయిన ఓ అభిన్న సత్యం; అది ఒకేసారి ఆధ్యాత్మికమూ, భౌతికమూ కూడా. ఇక్కడ సంప్రదాయ గ్రీకుల అభిప్రాయంలో లాగ, చాలక శక్తులను ప్రాచ్యులు బాహ్యవస్తువులుగా పరిగణించలేదు. ఎందువల్లనంటే చలనం, మార్పు వస్తువుల నిజధర్మం కనుక; అవి వస్తువుల ఆంతరిక ధర్మం. అలాగే ప్రాచ్య భావనలో ప్రపంచాన్ని పై నుండి నడిపే ఓ దేవుడెవడూ లేడు; అంతర్గతంగానే ప్రపంచాన్ని నడిపించే మూల సూత్రాన్ని ప్రాచ్యులు గుర్తించారు. (బృహదారణ్యకోపనిషత్ 37-15)

రాబోయే అధ్యాయాల్లో ప్రాచ్య ప్రాపంచిక దృష్టిలోని మూలసూత్రాలను, ఆధునిక భౌతికశాస్త్రం వెలారుస్తున్న ప్రపంచ దృష్టిని గురించి చర్చిస్తాము. ఇప్పటి శాస్త్రీయ సిద్ధాంతాలకు ప్రాచ్యచింతన - ముఖ్యంగా మార్మిక వాదం - తాత్త్విక నేపథ్యాన్ని కల్గిస్తోందని చెప్పటమే ఇక్కడి ప్రయోజనం; శాస్త్రీయ ఆవిష్కరణలకు, ఆధ్యాత్మిక లక్ష్యాలు మత విశ్వాసాలకు చక్కటి పొందిక కుదిరి వుందని చెప్పటమే లక్ష్యం. ఈ లక్ష్యాన్ని, ప్రయోజనాన్ని ప్రతిపాదించే భావాలు రెండు - అవి ఏకతా సూత్రాన వస్తువుల పారస్పరిక సంబంధం, విశ్వానికున్న ఆంతరిక గతిశీల ప్రకృతి. మనమింకా సూక్ష్మ ప్రపంచాన్ని దర్శించ ప్రయత్నం చేసినపుడు, ఎలా ఆధునిక భౌతిక శాస్త్రజ్ఞుడు కూడా ప్రాచ్య మార్మిక వాదిలా అవిచ్ఛిన్నం కాని వ్యవస్థలా ప్రపంచాన్ని చూస్తాడో మనకు స్పష్టమవుతుంది. ఆ ప్రపంచం పారస్పరిక సంబంధాలు కలిగి వుండి, గతిశీలమైన ద్రవ్యాలతో కూడి పర్యవేక్షకుడు కూడా ఎలా ఆ వ్యవస్థలో భాగమయి పోతాడో మనం గమనిస్తాం.

పాశ్చాత్యంలో - ముఖ్యంగా యువతరంలో - అసంతృప్తికి కారణం ప్రపంచాన్ని గూర్చిన యాంత్రిక, భిన్న భావనలే. అందుకనే వాళ్ళు ప్రాచ్య ముక్తి మార్గాలపై తమ దృష్టిని మరల్చారు; యోగం లేక మిగతా ధ్యాన మార్గాలను అనుసరిస్తున్నారు; వాళ్ళు విజ్ఞానశాస్త్రాన్ని - ముఖ్యంగా భౌతికశాస్త్రాన్ని - ఊహారహిత, సంకుచిత శాస్త్రంగా భావిస్తున్నారు. నిజానికి ప్రాచ్య జ్ఞానానికీ, పాశ్చాత్య విజ్ఞానశాస్త్రానికి విభేదం లేదు. రెండూ ఒకే 'టావో' వైపు - ఒకే మార్గం వైపుగా పయనిస్తున్నాయి. అది భావ (హృదయ) మార్గమేననీ - ఆధ్యాత్మిక జ్ఞానానికీ, ఆత్మ జ్ఞానానికి దారితీసే మార్గమేననీ వెల్లడి చేయటమే ఈ ప్రయత్నం. ★

**Source: Scientific Journals**

